# సనాతన సారథి

సత్య ధర్మ శాంతి ప్రేమల ద్వారా మానవజాతి యొక్క

సామాజిక నైతిక ఆధ్యాత్మికాభివృద్ధి కర్పితము

సంపుటము 23 సెప్టెంబర్ 1980 సంచిక 9

చిత్రము : — మానుషీం తను మాశ్రితం



## చందాదారులు గమనించండి !

మీ చందా గడువు ఏ నెల ఏ సంవత్సరమువరకు ఉన్నదో మీ చందా రసీదు కార్డులోను, మీకు నెల నెలా పంపుచున్న పత్రికపైనున్న విలాసము గల కాగితము లోనూ తెలుపుచున్నాము. దానిని గమనించి, ఆ నెంబరు " .../-10-"80 అనియుండిన, మీ చందా అక్టోబర్ నెలలో అయిపోవునని తెలుసుకొని, క్రొత్త చందా (సం॥నకు 6 రూ ॥) సెప్టెంబర్ నెల 31వ తేది 1980 లోపల పత్రిక యొక్క కార్యాలయమునకు చేరునట్లు పంపవలెను.

## మూడవ ప్రపంచ మహాసమ్మేళనము

శ్రీ సత్యసాయి సేవాసంస్థల 19-20-21 నవంబర్ 1980 మూడవ ప్రపంచ మహాసమ్మేళనములో పాల్గొనుటకు వచ్చు డెలిగేట్లకు, సికింద్రాబాద్ ధర్మవరం, పెనుకొండ, బెంగళూరు నుండి పుట్టపర్తి చేరుటకు ప్రయాణ సదుపాయములను కలుగజేయుటకు, సమ్మేళనమునకు సంబంధించిన ట్రాన్సుపోర్టు కమిటీ అవసరమైన ఏర్పాట్లు గావించుచున్నది. డెలిగేట్లు తమ ప్రయాణ వివరములను, తమ రాష్ట్ర సేవాసమితి అధ్యక్షులద్వారా అధికృతనమూనాలతో 1980 అక్టోబరు 15వ తేదిలోపల పంపుటకు కోరడమైనది.

సంపాదకుడు

సంవత్సర చందా 6 రూ ॥ గడువు ముగిసిపోవుటకు ముందుగనే మీ చందానందరుతో చెల్లించవలయును.

వివరములకు అట్టలోపలి భాగములో చూడండి.



# సత్యసాయివాహిని

భగవాన్ శ్రీ సత్యసాయిబాబా

## 21

వేదము సనాతన శాస్త్రము; శాస్త్రమనగా అజ్ఞాత జ్ఞాపకము: అనగా, లోకసిద్ధము కాని అతీంద్రియములైన, అర్థముల దర్శింప జేయుటకు ప్రవృత్తమైనది. పురుష బుద్ధికి గోచరము కానిదగుటచే, "పరమంవ్యోమ, పరమంపదమ్, అక్షరమ్, తత్, సత్" అని యీరీతిగా ఋగాది శ్రుతులన్నియు తెలిపెను.

ఒక వేదమును తెలియజేయుటకై అనేక వేదములావిర్భవించెను. వేదశబ్దము మొదట సర్వజ్ఞుడగు పరమేశ్వరునకు వాచకమగుచు, (వేత్తీతివేదః) తరువాత తత్స్వరూప నిరూపణాపరమై (వేదయతీతి వేదః) సర్వజ్ఞకల్పమగు ఋగాది శబ్దరాశికినీ వాచకమైనది. తరువాత తదనుగుణముగ ప్రవృత్తములయ్యెడి, ధర్మ, అర్థ, కామములకు నుపలక్షకమగుచున్నది. మొదట (సర్వద్రష్ట) యగు పరమేశ్వరుని బోధించుచు, తరువాత ఆ పరమేశ్వరుని దర్శింపజేసెడి (దర్శనాత్) ఈ వేదము, ఋషి శబ్దరాశికి కూడా వాచకమై వరలినది. తరువాత ఋషులు దైవ వేదములను ఆరాధించి తదనుగ్రహముచే ద్రష్టలయి వెలసి, ప్రసిద్ధములైరి.

దీనిని పురస్కరించుకొని పరమేశ్వరునకు "మహర్షి" అని కూడా నామము ప్రసిద్ధమైనది. బ్రహ్మసూత్రమున "మహర్షిః ముఖ్యర్షిః శివః" అని కూడా సహస్రనామములు కలవు. పరమేశ్వరుని దర్శింపజేయునదగుట చేత, వేదమునకు ఋషి అనియు నామము సార్థకము. బ్రహ్మ అని వేదమునకు నామము. అందుచే బ్రహ్మను పొందుటకై చేయు ఫలత్యాగ కర్మలకు, బ్రహ్మయజ్ఞమని, ఋషియజ్ఞమని కూడా చెప్పుతూ

వచ్చిరి. శుద్ధ, శుభ, సాత్విక, నిస్వార్థ కర్మల న్నియూ యజ్ఞములే.

ఈవిధములైన ఫలత్యాగ కర్మలలో, పదే పదే స్వాహా అనుచు అర్పితము గావించుచుందురు. ఈ స్వాహా శబ్దసాంప్రదాయములకు గతములైన శబ్దముల అర్థములను చూతము. కేశవాయి స్వాహా, ప్రాణాయిస్వాహా, ఇంద్రాయిస్వాహా, ఇత్యాది స్వరములయందు, 'స్వాహా' పదము నకు సామాన్యముగ "హవిస్సు సుహుతమగు గాక" అని అర్థము చెప్పదురు.

''సుహుత'' మన నేమి? అగ్నియందు విడువ బడిన యజ్ఞాదిద్రవ్యములు దగ్ధమగు గాక, జీర్ణ మగు గాక, అని ఇక్కడ ఒక సందేహము కలుగవచ్చు. అగ్నిలోవేసిన సమస్త పదార్థ ములు, సహజంగానే దగ్ధమగును. జీర్ణమగును కదా, ఇక స్వాహాకారము చేయుటచేత కలుగు ప్రత్యేకత ఏమి? స్వాహుతి అనగా వస్తువులను దగ్ధము చేయుట, జీర్ణము చేయుట మాత్రమే శృతితాత్పర్యము కాదు. దగ్ధ మగుట ప్రత్యక్ష గోచరము మాత్రమే; వైదిక దృష్టి వేరు.

కుమారసంభవ కావ్యమందు, కాళిదాసు, హిమాలయమును వర్ణించుచూ ''దేవతాత్మా'' అని అన్నాడు. అనగా, దేవతా శరీరము, భౌతిక శరీరము అని ప్రతిదానికి రెండు శరీరములు కలవు. ఇది శృతి సమ్మతము. దేవతా శరీరము అతీంద్రియం, భౌతిక శరీరం ఇంద్రియములతో కూడినది. దేవతా శరీరమున అగ్ని ప్రాణాగ్ని అగుచున్నది. అందులో ఆహుతి హవిస్సు అగు చున్నది. ఆహుతి యొక్క స్వరూపమును శ్రుతి యిట్లు వివరించుచున్నది. అత్తా, అద్యము అనగా భోక్త, భోగ్యరూపమగు ఈ జగత్తు ఏకీ భూతమయినపుడు, రెంటినీ కలిపి అత్తా అనియే అనగా భోక్త అనియే, వ్యవహారము. ఆ భోక్త యెవరు? అదే అగ్ని. అది దైవికముగ ఆది త్యుడు; ఆధ్యాత్మికముగ ప్రాణము. అట్టి ప్రాణాగ్నియందు సమంత్రముగ నుంచబడెడి అన్నాది హవిస్సులకు ''ఆహితయః'' అని పేరు. స్వాహా శబ్దము కేవలము హోమ సూచకమైన సాంకేతిక పదము మాత్రమే కాదు, సార్థకమగు వాఙ్మయము.

చందయతిః ఆహ్లాద, చాదనమనగా బలవం తుడగుట, ప్రాణశక్తివంతుడగుట, ఆచ్ఛాందిం చుట. ఇట్టి ధర్మబలముండుటచేతనే వేదము లకు చందస్సులని పేరు. ఇట్టి వేదము నాచ్ఛాదించు వారలకు సుశక్తివంతులని తైత్త రీయ శృతి యెంతయో విపులపరచినది. ఇట్టి క్రతువు ఒక వ్యక్తికేకాక లోకోత్తరాహ్లాదమునే కలి గించునదైయున్నది. ''యజ్ఞాంగః యజ్ఞవాహనః వృషరథః'' ఇత్యాది నామములు శృతి, స్మృతు లయందు పరమేశ్వరునకు చెప్పబడినవి. హిర ణ్యగర్భుడు సుపర్ణ చందోమయుడు, సుపర్ణ మనగా గరుత్మంతుడు. చందోమయమను గరు డుని వాహనముగా స్వీకరించినవాడు.

వృష అనగా ధర్మస్వరూపము. ధర్మమునే వాహనముగా చేసుకొనుట. విష్ణు ఆలయము లందు గరుడ. శివాలయములందు వృషభం స్తంభములను ద్వారములముందు యుంచి యుండుటలో ఇదే అంతరార్థము.

ఛాదన మనగ, సంసారవృక్షరక్షణము. ఫల కాములై కర్మలయందు చరించు వారికి

తత్త్వము నాచ్ఛాదించి, ధర్మనిష్టులగావించి, సంసార వృక్షమును రక్షించుచుండును. కర్మి ష్టులనధర్మరూప మృత్యువునుండియు జ్ఞాను లను సంసారరూపమృత్యువునుండియు నాచ్ఛా దించి రక్షించును. అట్లు రక్షించునట్టి వానినే చందస్సులనియు, అవే వేదములనియు చెప్ప బడెను. "ఛాదనాత్ ఛందాసి" మృత్యువు నుండి రక్షించగలుగునదని ఛందస్సులు శర్మ హేతువులు. యజ్ఞము దేవతలనుండి తొలగి పోయి కృష్ణమృగరూపమై సంచరించుచుండ దేవతలు వెన్నంటి, కడకు దాని చర్మమును గ్రహించగల్గిరి. యజ్ఞశరీరమే కృష్ణాజినము, దానియందలి శుక్ల, కృష్ణ, బభ్రువర్ణములు ఋగ్వేద, యజుఃసామములయొక్క రూప ములు. కనుక కృష్ణాజినము ఋగ్, యజుర్, సామవేదస్వరూపమనే నిర్ణయము గావించిరి. దీనిని త్రయీ విద్యారూపమనిరి. త్రయీ విహిత కర్మ సాధ్యమగుటచే యజ్ఞముకూడా త్రయీస్వ రూపము. ఇట్టి కృష్ణాజినమును గ్రహించుట చేతనే, యజ్ఞదీక్షితుడగు యజమానుడు, ఛంద స్సుల ప్రేరేపించును.

శుక్ల, కృష్ణ బభ్రు వర్ణములుకల కృష్ణాజినము లోకత్రయరూపము. కాన కృష్ణాజినము ధరించి యజమానుడు లోకత్రయ దీక్షితుడగుచున్నాడు. దీక్షితుడైన యజమాని గర్భస్థశిశుతుల్యుడు. దర్భస్థ శిశువు యేరీతిగ వ్రేళ్ళుముడిచి గుప్పిటిపట్టి మాత్రుశరీరాచ్ఛాదితుడై యుండునో యజమా నుడు అట్లే గుప్పిడిపట్టి త్రయీ విద్యారూప ఛందోమాతృశరీరాచ్ఛాదితుడై కృష్ణాజినధారుడై యుండవలెను.

కృష్ణాజినము మానుషదృష్టిలో చర్మము. అది దేవతా ప్రీతికరమైనదగుటచేత, యజ్ఞకర్మల యందు శర్మమగుచున్నది. అందువలన యే యజమానుడు, యజ్ఞసమయమున "నీవు శర్మ స్వరూపివి. నాకు శర్మనిమ్ము" అని సంబోధిం చును.

శర్మమనగా సుఖము, ఆనందము. ఆనంద స్వరూపుడు విష్ణువు. విష్ణువు యజ్ఞస్వరూపుడు. "యజ్ఞోవైవిష్ణుః," ఆ విష్ణు త్రయీ విద్యాస్వ రూపుడు.

(సశేషము)

# మానవునకు స్వేచ్ఛా సంకల్పము కలదా ?

(గతసంచికలో 192వ పేజీనుండి.)

అజ్ఞానియగు మనుష్యునకు స్వేచ్ఛాసంకల్పము లేదు. వివేకముయొక్క బిడ్డయగు మనుష్యునకు స్వేచ్ఛాసంకల్పముగలదు; ఎందుకనగా వివేకసామర్థ్యములు రెండునూ సమానార్థక శబ్దములు. కేవలము సంపూర్ణస్వేచ్ఛతోనే స్వేచ్ఛాసంకల్పము ఉండగలదు. అభిప్రాయములు లేని మనస్సు (బాబాగారు వచించినట్లు "a die mind") స్వేచ్ఛాసంకల్పము కలిగియుండును. మనుష్యునకు ఇంద్రియములద్వారా చేకూరిన అభిప్రాయములు, తలంపులు, గతజన్మల శేషానుభూతుల మొత్తము మనస్సగును. సంకల్పము స్వేచ్ఛగానుండవలెననిన మనస్సు ఇంద్రియములనుండి వేరుగావలయును; బుద్ధినుండి వెలుగును పొందవలెను. ఇట్టిదే శుచిప్రజ్ఞ. బుద్ధి ఆత్మనుండి జ్యోతిని పొందినప్పుడు జగత్సంబంధమైన స్వేచ్ఛాసంకల్పమును పరమాత్మతో ఆత్మ నిదానముగా లీనమైపోవును. ఇట్లు స్వేచ్ఛగానుండు సంకల్పము స్వేచ్ఛాసంకల్పమును పొందును "స్వతః గుర్తించిన ఆత్మకు తనదేయగు సంకల్పమంటూ ఉండదు" అని స్వామివిగమానంద తెలివిగా గుర్తింపజేస్తున్నాడు. జగత్సంబంధమైన సంకల్పము అట్లువ్యవహరించుటకు ఒక వాహనమగును. స్వేచ్ఛాసంకల్పము యొక్క సర్వవ్యాపకత్వమును గుర్తించుకొనకలిగిన అన్ని వ్యత్యాసములు నశించిపోవును; అదిమట్టుకే మిగులును.

మానవులకు స్వేచ్ఛాసంకల్పము ఉన్నదా? లేదా? అను తెమలని వాగ్వివాదములో దిగుట నిరర్థకము. స్వాతంత్ర్యము యొక్క పరిమాణము సంకల్పము యొక్క స్వేచ్ఛను నిర్ణయిస్తుంది. ప్రవర్తించుట, ప్రతిపర్తించుట, పుట్టుట, గిట్టుట ఆదిగా విషయములచే భేదపరచబడిన వ్యక్తిత్వముగల మానవుడు స్వాతంత్ర్యపు అంచును అందుకొన లేడు. అందువలన ఒక భక్తుని బాబాగారు ఇలా ప్రశ్నించినారు" చేత (doing) ఇంతముఖ్యమని నిన్ను గ్రహింపజేయునది యేది? సమమనస్కుడై యుండుము, అప్పుడు చేయుట, చేయకుండుట అను ప్రశ్నలచే తొందర పెట్ట బడవు." చేయుట, చేయకుండుట, మన ఉనికిని ప్రతిబింబింపజేయును కాని నిర్ణయించవు. మన సంకల్పము స్వేచ్ఛాయుతముగా నుండవలెననిన, ఆ సర్వశక్తుడు, తన స్వేచ్ఛాసంకల్పమును మనగుండా ప్రసరింపించునో, ఎవరైతే మనకు స్వరూప మిచ్చెనో ఆయనకు మనము అర్పితము కావలెను.

స్వేచ్ఛాసంకల్పమును పొందిన మానవుడు యేమి చేయవలెను? ఏమి చేయకూడదు? అనువానిని తీర్మానించుకోనవసరము లేదు. తనకు తెలియకుండగనే కార్యాచరణములు సాగిపోవుచుండును. ఈ చర్యలు సర్వజ్ఞుని సంకల్పముయొక్క భావములగును, సులభమగును, సహజకర్మయగును. విమర్శించుట, పరిష్కరించుట, ప్రవర్తించుటయను అక్కరలచే పీడింపబడడు. ఈ మూడు దశలు ఏకకాలమందు సంభవించును, సంకల్పము నెరవేరును.

అడవిమంటలో నిప్పురవ ఉన్నప్పటికినీ నిప్పురవ అదికాదు. "స్వేచ్ఛగానుండుటకు సంకల్పము"

స్వేచ్ఛాసంకల్పమునుండి పుట్టినప్పటికిని, అది కాదు. స్వేచ్ఛసంకల్పము ఒక్కటే; ఎందుకనగా ఒక్కటిగా ఉంటుంది. అనేకులలో ఉండిన అనేకులతోపోల్చ వచ్చును. ఒకవిశుంఢుపదంతయూ సంక్రమించుకొన లేము. మనము మనవైఖరులకు బానిసలుగానున్నంత వరకూ మనకు స్వేచ్ఛాస్వాతంత్ర్యము ఉండదు. సంపూర్ణస్వేచ్ఛను పడయగలము.

అనువాదకుడు:—బి. నరసింహమూర్తి

బిజయ్. కె. మిస్రా—కటక్

# నిరతమగు హాయి

సదా సారాయి తప్ప అన్యమెరుగని నాలో సారాయిలోని 'రా' రాహిత్యమొనరించి 'సాయి'నే నిల్పి హాయిని గొల్పిన సత్యసాయీశ్వరా! ధన్యుడను.

ప్రప్రధమంగా ప్రభువు సత్యసాయి దర్శనార్థం సతీ సమేతంగా 1969లో శివరాత్రికి ముందురోజున పుట్టపర్తి చేరుకున్నాను. భగవాన్ భక్తుల, బంధుమిత్రుల ప్రోత్సాహమే నన్నీ పనికి ఉత్సాహపరచినది. మిత్రుడిచ్చిన Sai Baba, Man of miracles పుస్తకం చదివాక నేను ఆశ్చర్యమొందటమేకాక, నిజానిజాలు తెలుసుకోవలెనను పట్టుదలకూడా నాలో కొద్దిగా లేక పోలేదు.

ఆరోజుల్లో ప్రశాంతినిలయ వాతావరణం అక్షరాలా ప్రశాంతమే! ఇప్పటి కట్టడాలు ఏమీలేవు. ఏటారుగా పెరిగిన చెట్టుక్రింద సామాన్లుంచి, చిత్రావతీ నదీస్నానమాచరించి వచ్చునరికి' స్వామి! స్వామి! అనే భక్తుల మాటలు విని పరుగెత్తి ప్రప్రధమంగా ప్రభువును కనులారకాంచినారము. ఆహా! ఏమా దివ్యతేజస్సు! అప్పు డనుకున్నాను, హవార్డ్ మర్ఫెట్ వ్రాతలు అనృతములు కావని. రెండుదినాలలో మాసామాన్ల ప్రసక్తి, వాటిపట్ల ఆసక్తి లేకుండుటయే కాక, వెళ్ళేరోజు ఉదయానికి ఎక్కడి వక్కడ ఉండటం; నన్ను ఆశ్చర్యపరచిన విషయాల్లో మరొకటి, స్వామి ప్రక్కనుంచే వెళ్ళిపోయేవారు.

నాకు, నాటికీ నేటికీ INTERVIEW కావాలని అపేక్షలేదు. కారణం, కరుణామయుడు కావలసినవి సకాలంలో అందచేయటమే. నిజము చెప్పాలంటే అప్పట్లో నాలోఅంతగా పరిణామమేమీ కలుగలేదు. అందరిలాగే స్వామిని చూచి, భజనలుచేసి, శివరాత్రి మరునాడు పుట్టపర్తివదలి వచ్చివేసినాము. వ్యసనపరులు స్వామి కార్యములయందు కానీ,సంఘములో కానీ, ఎందునా, నిర్మలంగా, నిశ్చలంగా ఉండలేరు.

అది 1975 అక్టోబర్. భగవాన్ శ్రీశ్రీశ్రీ సత్యసాయి సమితివారు సప్తాహ ఉత్సవాలు జరుపుచున్నారు వారు పసుపు పచ్చని ప్రభువు ఫోటోకల కార్య

క్రమాన్ని సూచించే కరపత్రాన్ని మాయింటికి పంపారు. అప్పుడు రాత్రిపది అవుతుందనుకుంటాను. అనునిత్యమూ నాప్రవర్తనలో ఏనాటికైనా మార్పు రావాలని శ్రీసత్యసాయిని ప్రార్థించే నాఅర్ధాంగి, సగం భయంతోనే నాకు ఆకాగితాన్ని అందించింది. పిచ్చివాళ్ళు! నేను త్రాగుబోతునని తెలిసికూడా నాకు పంపారు. సదా సారాయిలో తేలేనాకు, 'సాయి' విచారణకు వ్యవధి ఎక్కడిది? అనుకొని అక్కడేయున్న మేజామీద ఆకరపత్రాన్ని పడేశాను.

నేను జన్మతః బ్రాహ్మణుడను, నా ఉద్యోగమూ, మంచిదే. మాపిల్లలా, విద్యావంతులు, నేనా త్రాగుబోతును. ఈవాతావరణంలో నిరంతర ఆలోచనా పరంపరల మధ్య తేలియాడే నా అర్ధాంగి క్రమక్రమేణా అనారోగ్యానికి గురియై, నాప్రవర్తనవల్ల బెంగతోడు, విపరీతమైన మూలవ్యాధితో బాధ పడుతోంది. బాబాయే శరణ్యమంటుంది! కానీ నాలోఇంకా కనువిప్పు కలుగలేదు.

అది అక్టోబర్ 12, ఆదివారము 1976న దీనబంధువు కరుణించి నన్ను మనిషిగా మార్చిన మరువలేని మహత్తర సుదినం. సమయం సాయంకాలం 7గం॥లు. తప్పత్రాగిన నేను సాయి సభ్యుడైన మిత్రుడి బంగళాకు వెళ్ళినాను. కాదుకాదు స్వామియే నన్ను తీసుకువెళ్ళారు! ఎదురుగావచ్చిన కుర్రవాణ్ణి అడిగాను, వాళ్ళ నాన్నగారేరని? సాయిబాబాగారి భజనకు వెళ్ళారన్నాడు అదే! అదే! ఒక్కసారి, నా నిషా మటుమాయమైంది. నేను బాబాగారి భజనకు వెళ్తానని బయలు దేరాను. పత్రివాతావరణం తెలిసినవాడిని, కావున చేతిలోని సిగరెట్టు పారేసి, పాదరక్షలువిడిచి భజన హాల్లోకి వెళ్ళి కూర్చున్నాను. అక్కడ చిన్నారిపాపలు గీతా పఠనం చేస్తున్నారు. "గోవిందకృష్ణజై— గోపాలకృష్ణజై" అని తన్మయంతో పాడుతున్నారు. ఇంక కూర్చోలేకపోయాను. నామనసులో ఆందోళన చెలరేగింది. చాలాపెద్దతప్పు చేశానని, చేస్తున్నానని, ఆవేదన పడ్డాను, బయటనున్న అరుగుమీద చీకటిలో ఒక్కణ్ణే కూర్చున్నాను. నాలో తర్జన భర్జనలు ప్రారంభమయ్యాయి. "వ్యసనవిసర్జనము చేయగలనా"? అని ఆలోచించాను. అంతలో దుస్సాంగత్యానికీ, సత్సాంగత్యానికీ గల వ్యత్యాసం నాకు అక్షరాల కనపడుతోంది. ఒకే ఒక దృఢవిశ్చయానికి వచ్చాను. నా శేషజీవితంలో ఒకే ఒక్కధ్యేయం ఉండాలని— "సాయియా?" లేద "సారాయా"? ఛీ! ఛీ! దుస్సాంగత్య ఫలితంగా ఎంతపాపానికి ఒడి గట్టినానని విచారించి అదిమొదలు "సత్యసాయి" తప్ప అన్యమెరుగక, ప్రభు కరుణా కటాక్షమువల్ల నేను నిరతమూ హాయిగా సాయినామమును స్మరిస్తూ కాలము గడుపు తున్నాను.

—కె. యన్. మూర్తి.
బిలాస్‌పూర్.

# అ క్ష య వి భూ తి

నవంబరులో మేం ప్రశాంతినిలయం చేరేసరికి నా ఆరోగ్యం చాలా బాగున్నట్లనిపించింది. నాకసలు జబ్బుచేసిందంటేనే నమ్మడం కష్టమని తోచింది. వెళ్లిన కొద్దికాలంలోనే స్వామి ఇంటర్వ్యూ యిచ్చారు. ఆ సమయంలో విభూతి సృష్టించి, నన్ను చొక్కా విప్పుమని, దానిని నా గుండెలమీద రాశారు. నేను స్వామితో ఏమీ చెప్పలేదు. అయినా స్వామి "నీ గుండెకేమీ కాలేదు." అంటూ నాకు అభయమిచ్చారు. (గత సెప్టెంబరులో నాకు గుండెపోటు వచ్చింది). అంతేకాక "నీది చాలా మంచి హృదయం, బలమైనది కూడా, ఏమీ దిగులు పడకు. నేనిక్కడ వుండగా భయమేల"? అంటూ హృదయంవైపుచూపిస్తూ, ఉంగరమొక దానిని సృష్టించి "దీనిని వేలుకు ధరించు, నేను సదా నీతోనే వుంటాను." అన్నారు, అందులో బాబావారి చిత్రమొకటి వున్నది. ఆ ఉంగరం నాకు స్వామితో సంబంధం కల్గించడమేకాక నా జీవితాన్ని మార్చి వేసింది.

ఆ ఉంగరం సృష్టించి యిచ్చిన సంఘటన నాకంత ఆశ్చర్యం కల్గించలేదు. ఉత్సుకతకూడా పెంపొందించలేదు. నాకు అచ్చెరువు కల్గించిన సంఘటన మరొకటి. అది చాలా వేగంగా జరిగిపోయింది. ప్రశాంతి నిలయం చేరేముందు ఇంద్రాదేవితో మాట్లాడుతూ "స్వామి విషయం అంతా నమ్మ కల్గుతున్నాను గానీ, ఈ మహిమలూ, చమత్కారాల విషయమే నాకు అంతు పట్టడం లేదు" అన్నాను. శ్రీరామ కృష్ణ పరమ హంస జీవిత చరిత్రలో సిద్ధులు పొందిన వారు వాటిని తమ గొప్పతనాన్ని చాటుకోవడానికి వినియోగించు కుంటే ప్రక్కదార్లు పట్టిపోతారని చదివాను. ఈ మహిమలు చూపించడం తమ అహంకారం చాటుకోవడమనీ, ఉన్నతమైన ఆధ్యాత్మికస్థాయికి సంబంధించినది కాదనే అపోహ నాలో ఉంటుండేది. స్వామి ఆ మహిమలు చూపడంలోగల అంతరార్థంగురించికూడా కొన్ని అను మానాలు కలిగాయి. అయితే స్వామికి దగ్గరయ్యే కొలదీ, స్వామితో అనుభవం పొందేకొద్ది ఆ అను మానాలు పటాపంచలయ్యాయి. అవన్నీ స్వామికి స్వతస్సిద్ధంగా వచ్చినవనీ, స్వామి చేసే ప్రతిపని వెనుకా ఎంతో ప్రగాఢమైన కారణం వుంటుందనీ అవగతమయింది. అంతేకాక స్వామి మానవులను వుద్ధరించడాని కవతరించిన వ్యక్తి అని కూడా గ్రహించగలిగాను. ఈ మహిమల పట్ల స్వామికి పెద్ద ప్రత్యేక ఆసక్తి ఏమి లేదనికూడా గుర్తించాను.

మనుష్యులు కల్పించుకున్న మానసిక దౌర్బల్యం మంచి వారిని వున్నతస్థాయికి తీసికొని పోయే ఉద్దేశ్యంతో స్వామి అవతరించారు. అంధకారంలో మ్రగ్గుతున్న ప్రజను ప్రకాశంలోకి తీసుకోవడానికి వారు మానవరూపం ధరించారు. తన సాన్నిధ్యంలోకి వచ్చిన ఏ వ్యక్తికైనా సహాయం చేయడానికి స్వామి సదా సన్నద్ధంగా వుంటారు. వారు చేపట్టిన కార్యక్రమమే అది కదా: వస్తుప్రపంచములో తలమునకలవుతూ, ప్రతిక్రియకు వైజ్ఞానిక కారణాలు వెతికే పాశ్చాత్యుడి మనస్సుకివి విడ్డూరంగా తోచడం సహజమే. అటువంటి వ్యక్తుల భావాలను చెదరగొట్టి విజ్ఞాన

శా(స్త్రానికతీతమైనవి కలవని నిరూపించడానికే స్వామి చమత్కారాలద్వారా వస్తువులను సృష్టిస్తూంటారు. ఏవేవో ఆలోచనలతోనూ, హేతువాదంతోనూ సతమతమవుతూన్న విద్యావంతులకూ, విజ్ఞానవేత్తలకూ ఈ మహిమలు అగమ్యగోచరంగా అగుపిస్తాయి. వారు వాటిని గురించి ప్రశ్నలవర్షం కురిపిస్తుంటారు—కురిపించాలికూడా! వాటికి ఒకే ఒక సమాధానం—స్వామి దైవం. సామాన్యంగా బుద్ధిమంతులుగా భావించబడే ఈ విద్యావేత్తలు దైవాన్ని గురించి నమ్మడంకష్టం. అందువల్ల దైవసాన్నిధ్యం చేరడం కూడా కష్టమే.

అమాయకమైన హృదయంతో, ప్రేమనిండిన చిత్తంతో, నమ్మకం కల్గిన వ్యక్తిమాత్రమే భగవత్సన్నిధికి త్వరితంగా చేరగల్గుతాడు. అతడు భగవంతుని అర్థం చేసికోవడానికి తాపత్రయపడేబదులు భగవంతునికి చేరువకావాలని తపనపొందటమే దీనికి కారణం అయితే బుద్ధి మంతులుగా భావించబడే విద్యావేత్తలు దీనికి విరుద్ధంగా భగవంతుని చేరకముందు, ఆయనను అర్థం చేసుకుందుకు ప్రయత్నిస్తారు. లక్షలాదిమంది ఈవిధంగా ప్రయత్నించి విఫలులయి పెడదార్లు పట్టారు. భగవంతుని అర్థం చేసికోవడంకోసం సమయాన్ని వ్యర్థం చేసుకొనే యత్నంలో జీవితం అంతా ఆలోచనలతో సతమతమవ్వాలి.

ఇదంతా మీకు చెబుతున్నందుకోకారణం వుంది. నేను ఇంటర్వ్యూకు వెళ్లిన రోజు ఇంద్రాదేవిని కూడా స్వామి ఇంటర్వ్యూకు పిలిచారు. ఆ సమయంలో ఇంద్రాదేవి స్వామితో "తనకి లోగడ స్వామి యిచ్చిన విభూతిప్రసాదం అయిపోయిందనీ, ఎందరికో దానివల్ల రోగాలూ సమస్యలూ నయమయ్యాయనీ, అందువల్ల తిర్గీ తగినంత విభూతిప్రసాదం యివ్వ"మనీ కోరింది. స్వామి ఆమెతో "అలాగే" అంటూ తన రెండు చేతులూ వలయాకారంలో త్రిప్పి దోసిలి పట్టారు. స్వామి దోసిట్లో నాలుగంగుళాల ఎత్తు గల్గిన నాలుగంగుళాల వ్యాసం గల్గిన భరిణ ఒకటి వున్నట్లుండి పైనుండి వచ్చి చేరింది. అది చూస్తున్న నేను నాలో "ఈ మహిమ కాస్త చాతుర్యం వల్ల కానీ, చొక్కా చేతులలోంచి తీసిన మాయకాదే. ఇది నిజంగా అసామాన్యమైనది" అనుకొన్నాను. భరిణ మూతను స్వామి విప్పి, అందులో నిండుగా వున్న విభూతిని ఒక కాగితంమీద పోసి భరిణను ఖాళీ చేసారు. తిర్గి భరిణను పైకి నిలబెట్టే సరికి దాని నిండుగా విభూతి నిండి వున్నది. కాగితంమీద విభూతిని అక్కడున్న వారికి పంచి పెట్టినతరువాత ఆ భరిణను ఒక చిన్న గుడ్డసంచిలోవేసి ఇంద్రాదేవికి ఇస్తూ "ఇపుడు ఈ భరిణ విభూతితో అక్షయమైనది ప్రసాదం అయిపోతుందేమోననే భయం ఇహ నీకు అక్కరలేదు." అన్నారు. ఆ భరిణ గత పది సంవత్సరాలుగా అనేకవేల మందికి అక్షయంగా విభూతిని ప్రసాదిస్తూ ఇంద్రాదేవి దగ్గరే వుంది.

నాకోసం ఉంగరం సృష్టించిన మహిమకంటే ఈ భరిణ సృష్టించిన మహిమే నాకు గొప్పగా తోస్తుంది. నేను భగవంతుడిగురించి తర్కవితర్కాల్లో పడుతూ లేస్తూ, మతంగురించి అధ్యయనం చేశానే తప్ప భగవంతుణ్ణి అనుభవంలోకి తెచ్చుకొనేప్రయత్నం చేయలేదు. స్వామి యిచ్చిన ఈ అనుభవం తర్వాత నా మనస్సులో భగవంతుడున్నాడా? లేడా? అనే ప్రశ్న మటు మాయ మయ్యింది.

—రిచర్డు బాక్

("మువ్‌మెంటు" పత్రికలో ప్రచురితమైన ఇంటర్వ్యూ ఆధారంగా)

# ఆఫ్రికా జనతకు అభయం

"ఈనాడు మన మధ్య పూర్ణ అవతారమూర్తి భగవాన్ శ్రీసత్యసాయిబాబా నడయాడుచున్నారు. వారు ఎన్నో జన్మలలో మనం చేసుకున్న పుణ్యానికి ఆశీర్వచన ఫలితం. ఆఫ్రికాఖండంలో ప్రస్తుతం నెలకొని వున్న అశాంతిస్థితి నెదుర్కోవడానికి, ఆఫ్రికా దేశాల సమైక్యతా సంస్థ (ఆర్గనైజేషన్ ఫర్ ఆఫ్రికన్ యూనిటి) కూ బాబావారిరాక, వారిజీవితం, వారి సందేశం చాలా అవసరమైనవి. బాబా మాత్రమే ఆఫ్రికాను రక్షించ గలరనీ, రక్షిస్తారనీ నమ్ముతున్నాను."

స్వామి గురించి వ్యక్తం చేయబడిన పై మాటలు సియర్రాలియోన్ (ఆఫ్రికా దేశ పౌరుడు) శ్రీ విక్టర్ కాను (M. A. OXEN) అత్యంత విశ్వాసంతోను, దృఢ నమ్మకంతోను వ్రాసిన ఒక వ్యాసంలోవివి. శ్రీ కానూ పూర్వము లండన్‌లో తనదేశము యొక్క హైకమిషనర్‌గా సేవచేసిన వాడు; సియర్రాలియోన్‌లో స్థాపించబడి, బ్రిటన్ మొదలైన దేశాల్లో శాఖలు కల్గిన ఆల్ పీపుల్స్ కాంగ్రెస్‌కుచెందిన ముఖ్య వ్యక్తి. వారు బ్రిటన్‌లో తమదేశపు రాయబారిగా చాలా కాలం పని చేశారు. తన వ్యాసాన్ని శ్రీ కానూ ఆఫ్రికా దేశాల సమైక్యతా సంస్థ దేశాలు సియర్రాలియోన్ లో జరిపిన శిఖరాగ్ర సమావేశం సందర్భంగా వెలువడిన పుస్తకంలో ప్రచురించారు. ఆఫ్రికా దేశాల్లో రోజురోజుకు పెరుగుతున్న స్వామి ప్రాభవాన్నీ, వారి సందేశం అందుకునేవారి సంఖ్య పెరుగుదలనూ ఆ వ్యాసం ప్రతిబింబిస్తున్నది. ఆ వ్యాసంలో శ్రీకానూ ఇంకా యిలావ్రాశారు.

"శ్రీసత్యసాయి బాబా వారు మానవాళిలో సత్య, ధర్మ, శాంతి, ప్రేమలను పునః ప్రతిష్ఠించి, వారిని ప్రస్తుత సంక్షోభస్థితినుండి రక్షించడానికవతరించారు. తనకార్యక్రమం గురించి ప్రజలు తెలుసుకోవడానికి నమ్మకం పెంపొందించుకోవటానికి, తనకు చేరువయ్యేటందుకు, స్వామి తమ అనంతమైన శక్తిని తమ మహిమలద్వారా కొద్ది కొద్దిగా వెలువరిస్తుంటారు. ఆ మహిమలను వారు తమ విజిటింగు కార్డులు" గా పేర్కొంటారు. సమస్త మానవసమాజానికి తాము చేయబోయే కార్యాలగూర్చి నిర్ద్వంద్వంగా ప్రకటిస్తూ —

"మీ అనుభవాలద్వారా నన్ను తెలుసుకోవడానికి ప్రయత్నించడం మీ జీవితలక్ష్యం. మీలో ప్రతి ఒక్కరూ రక్షింపబడాలి. నానుంచి మీరు దూరంగా వుందామన్నా నేను మిమ్మల్ని వదిలిపెట్టను. నన్ను కాదన్న వారిని, నన్ను వదలి దూరంగా పోదామనుకున్న వారిని కూడా నేను నావద్దకు రప్పించి రక్షిస్తాను. అందరికోసమూ వచ్చిన వాడిని నేను, నా నుంచి దూరంగావున్నా, అపమార్గం పట్టినా కూడా మిమ్మల్నందర్నీ ఆకర్షించి, ఆశీర్వదిస్తాను" అన్నారు. అని శ్రీ కానూ ఆఫ్రికా జనతకు తెలియచేశారు.

ఇంకా తనవ్యాసంలో శ్రీకానూ "ఆఫ్రికాలో ప్రస్తుతం వున్న అసంఖ్యాకమైన మతాలూ, ధర్మాలూ, నమ్మకముల దృష్ట్యా పాఠకులకి కొన్ని ప్రశ్నలు మనస్సులో మెలగవచ్చు. (1) బాబావారు కొత్త మతాన్ని ప్రబోధిస్తున్నారా? (2) మిగిలిన మతముల

గూర్చి, ప్రార్థనా పద్ధతుల గురించీ వారి ఉద్దేశ్యము లేవి? (3) బాబావారిని పూజించుటకు తెలుసు కొనుటకు తమ మతాచారములను వదలిపెట్టుకోవలెనా?" అని ప్రశ్నిస్తూ, ఆప్రశ్నలకు స్వామి యిచ్చిన సమాధానమే తెలిపారు.

"అన్నిమతములూనావే. ఒకమతంనుంచి మరోమతాకిని మారవలసిన అగత్యం ఏమీలేదు. మీ మతాచారాల ప్రకారం మీ పూజలనూ, ప్రార్థనలనూ గావించుకొంటుంటే తద్వారా నాకు చేరువకాగల్గుతారు. ఈ అనంతవిశ్వమే నాభవనం. నన్నుకాదన్నవారూ నావారే; మీకు ఇష్టమైనదేవతను మీ మనస్సులో చిత్రీకరించుకోండి. అయినా నేను ప్రత్యక్షం కాగలను. మీలోని అణువణువునా, ఘనఘనమునా నేనున్నాను. అంతేకాదు మీరు నీచము తలచేవాటిలోనూ, ఉచ్చముగా ఎంచేవాటిలోనూ కూడాఉన్నాను. అందువల్ల ఎవరికి హానికలిగించినా ఎవరిగురించి తప్పుడుప్రచారం చేసినా వారిలోవున్న నాకు బాధకలిగించినవారవుతారు" అని వివరించారు. అందువల్ల బాబా అన్నిమతాలనూ, అన్ని తరహా ప్రార్థనాపద్ధతులను సమానగౌరవంతోనూ, భక్తిభావంతోనూ చూడమంటార"ని శ్రీకానూ తెలియచెప్పారు, స్వామిసందేశాన్ని తమఖండవాసులకు అందిస్తూ శ్రీ కానూ మరోసారి స్వామియిచ్చిన ఉపన్యాసంలోని కొన్ని వాక్యాలనూ ఉటంకించారు.

"వివిధ ధర్మాలనూ వర్ధిల్లనివ్వండి. భగవంతుని గొప్పతనాన్ని అనేక భాషల్లో వివిధ రాగాలలో గానం చేయనివ్వండి. వివిధ ధర్మాల్లోవున్న భిన్నత్వాన్ని గౌరవిస్తూ, అందులోని ఏకత్వాన్ని గుర్తించండి. ఆ భిన్నత్వం మూర్ఖత్వం ద్వారా ఏకత్వం అనే జ్యోతిని ఆర్పివేయకూడదు," అన్న స్వామివాక్యాలతోబాటు ఆఫ్రికావాసుల కవసరమైన రీతిలో స్వామిసందేశం తెలియచేసేందుకు ఆనాటి మైసూరు రాష్ట్రపు ఆర్థికమంత్రి అధ్యక్షత వహించిన ఒక సభలో స్వామి చేసిన ప్రగాఢమైన, సత్యమైన ప్రకటనను అందచేశారు.

"పండితులకూ, రాజకీయ నాయకులకూ, ధర్మాధికారులకూ, ప్రభుత్వాధికారులకూ ఉండే సన్నిహిత సంబంధం తెంచివేయబడింది. వారు ఎవరిత్రోవల్లో వారు వేర్వేరుగా పయనిస్తున్నారు. రెండోవారు ఎట్లా భావిస్తారనికానీ, ఆలోచిస్తారనికానీ వారు గమనించుకోవడంలేదు. అనేక సంవత్సరాల పాటు కొనసాగిన పరిపాలనవల్ల పండితులంతా పురాతన సంప్రదాయానికి ప్రతీకలనీ, ఆధునాతన ప్రపంచానికి వారు పనికిరారనే భావం వ్యాప్తి కావడంవల్ల ఈఅగాధం మరింత ప్రగాఢమయింది. పరిపాలనమండి పరిపాలన స్వపాలన క్రిందకు వచ్చిన తరువాత కూడా ఈఅగాధం పూడ్చడానికి ఏప్రయత్నమూ జరుగలేదు. క్షణభంగురమైన విషయవాంఛలనూ, నీచమయిన వినోదాలనూ వెతుక్కొంటున్న ప్రజలు, సనాతనధర్మాన్ని ప్రబోధించేవారినీ, పరమాత్మ యిచ్చే పిలుపునూ పెడచెవిని పెడుతున్నారు. ప్రస్తుతం అమల్లోవున్న పంచవర్ష ప్రణాళికలు ఫలించి దేశమంతా ఆనకట్టలతో, విద్యుదుత్పాదన కేంద్రాలతో, కర్మాగారాలతో నిండి ప్రజ ధన సంపాదనలో మునిగేముందు, వారికి మానవసేవలోను, స్వయం నియంత్రణలోనూ సరియయిన తర్ఫీదు నివ్వని పక్షంలో సమాజంలో నీతినియమాలు పెద్ద యెత్తున దెబ్బతింటాయి. అందువల్ల దేశప్రజలను నీతినిజాయితీలలో, ఆధ్యాత్మిక పథంలో పయనింపచేసేందుకు, సంక్షోభానికి గురికాకుండా చేసేందుకు ఒక సమర్థవంతమైన పథకం రూపొందించాలి."

శ్రీకానూ ఆఫ్రికాలోని పరిస్థితిని వివరిస్తూ "ఆఫ్రికా సైనికదళాలకూ, రాజకీయ వేత్తలకు సంబంధం

త్రెగిపోయి రాజకీయంగానూ, సమాజపరంగానూ అస్థిరత ఏర్పడింది. ఈపరిస్థితికి పాశ్చాత్యపెట్టుబడిదారులను నిందించజాలము. దానిని బాబావారిచ్చే సలహాతో మాత్రమే నివారించగల్గుతాము. చాలా ఆఫ్రికా దేశాల్లో స్వాతంత్ర్యసముపార్జనానంతరం ఆయా ప్రభుత్వాలకృషి ఫలితంగా జీవనప్రమాణాలు పెరిగి వివిధ సదుపాయాలు ఏర్పడ్డప్పటికీ, రాజకీయంగానూ, తదితర రంగాల్లోనూ అశాంతి, అస్థిరతా ఎందువల్ల ఎక్కువయింది? పరపరిపాలనాకాలంలోకంటే, ఇప్పుడు ఎక్కువ పాఠశాలలూ, విశ్వవిద్యాలయాలు, ఆసుపత్రులు. రహదార్లు, కర్మాగారాలు, విమానాశ్రయాలు ఏర్పడ్డాయి. ఆయాశాస్త్రాల్లో నిష్ణాతులైన వివిధపండితులు ప్రస్తుత క్లిష్టపరిస్థితికి వారివారి శాస్త్రపరిజ్ఞానాన్ని బట్టి సమస్యల గురించి సిద్ధాంతాలను ప్రతిపాదిస్తున్నారు. వాటితోపోల్చినపక్షంలో బాబావారిచ్చిన పరిష్కారమార్గం సంపూర్ణమైనది." అంటూ తనవ్యాసంలో ఆఫ్రికావాసులకి స్వామి సందేశంలోని కొన్ని భాగాలను చెప్పారు.

"ప్రతి దేశనాయకులూ తమదేశాలను వివిధరంగాల్లోనూ అభివృద్ధి చేయటానికి మాత్రమేకాక ఆ సంపద వల్లవచ్చే సంక్షోభాన్ని ఎదుర్కోవడానికి కూడా పథకాలు సిద్ధంచేసుకోవాలి. జీవన ప్రమాణాలు ఎంతో మెరుగై ప్రాపంచికసుఖాలు అందరికీ అందుబాటులో వున్నప్పటికీ పాశ్చాత్యదేశాల్లో సుఖశాంతులు లేక సామాజిక జీవితం విచ్ఛిన్నమైంది. వ్యక్తిగతంగా ప్రతిఒక్కరూ నిరాశా నిస్పృహలతో సందేహభయాలతో, మతిభ్రంశంతో సతమతమవుతూ ఆత్మహత్యలకు పాల్పడుతున్నారు. గౌరవమర్యాదలు మంట కలిపి బాధలుపడుతున్నారు."

శ్రీకానూ తనవ్యాసంచివరి భాగంలో "స్వయంగా జీవితావసరాలనుత్పత్తి చేసుకోలేని ఆఫ్రికాదేశపు పరిస్థితి మరింత కష్టమైనది. జీవనప్రమాణాలు పెరిగి ప్రాపంచిక సుఖాలు మెరుగవడంవల్ల వచ్చే విపత్తుల నెదుర్కోవడానికి పథకాలను సిద్ధం చేసుకోవలసిన అవసరం ఆఫ్రికాదేశాల ప్రభుత్వాలమీద మరింత ఎక్కువగాఉన్న" దని స్పష్టంచేశారు.

అంతేకాక "భగవాన్ శ్రీసత్యసాయిబాబావారి అనుగ్రహం 1981 ఆఫ్రికాదేశాల సమైక్యతాసంస్థ శిఖరాగ్రసమావేశంపై వర్షించుగాక," అంటూ తనవ్యాసాన్ని ముగించారు.

—సంపాదకుడు



# దుఃఖ పరిహారము

ప్రపంచములో మానవుని ఆవేశించిన దుఃఖములు మూడు—ఆధ్యాత్మికదుఃఖము, ఆధిభౌతికదుఃఖము, ఆధిదైవికదుఃఖము.

ఆధ్యాత్మికదుఃఖమనగ—మనోవికారమువలన, రోగములవలన బాధపడుట, మానవదేహము మలినపు కొంప; పురుగులు క్రిమికీటాదుల నివాసస్థానము. దుర్గుణముల చేతనే మానసిక అనారోగ్యము సంభవించును. దయాగుణమను పవిత్రభావమును పెంచితే, ఆధ్యాత్మికదుఃఖమును నివారణచేసేందుకు అవకాశమున్నది. ఎంత తెలివితేటలున్నప్పటికినీ, గుణవంతుడుకాక, మానవత్వానికే అర్హుడు కాడు. గుణమే ప్రధాన శోభ. సద్గుణములను ప్రకటింపజేసి ప్రకాశింపజేసితే, ఆరోగ్యముతో పాటు ఆనందమును కూడ అందుకొనవచ్చు. రోగానికి మూలకారణము, దుర్గుణమే. దుర్గుణముల వలన, వార్ధక్యము కూడ అతిత్వరగా ఆక్రమించును. సుగుణాలవలన నిరంతర పటుత్వము, శక్తిసామర్థ్యములు, యౌవనము, అన్నీ అభివృద్ధి యగును.

విద్యార్థిదశలోనే దుర్గుణములు దుశ్చింతలు దురలవాట్లను చేరనీయక, పవిత్రమైన సద్గుణములనభ్యసించవలెను. ఆనందంద్వారా ఆరోగ్యం సిద్ధమగును. ఆరోగ్యహృదయం ఆనందనిలయం. యువకులు జగదోద్ధారకులుగా తయారుకావాలి. వారు సద్గుణములను హృదయమందు నింపుకోవలెను. మితభాష, మితాహారం వీటిని ఈ చిన్నవయస్సులోనే నిత్యజీవనమందు పాటించాలి. జైసే అన్, వైసే మన్, అంటారు. సాత్వికాహారమునే భుజించుటకు పూనుకోవాలి. ఆహారం ఎట్టిదో అట్టి భావము; ఎట్టి భావమో అట్టి బుద్ధి; ఎట్టి బుద్ధి, అట్టి సిద్ధి; దైవసన్నిధి అనే పెన్నిధి పొందుటకు ఆహారవిహారములను పరిశుద్ధపరచుకోవలెను.

ఆధిభౌతికదుఃఖమనగ—భూతములచేత పీడింపబడుట, అంటే, క్రిమికీటాదులచే పశుపక్షిమృగాదులచే కలుగు బాధలు. వీటిని నివారించుటకు యోగమార్గమునమసరించాలి. యోగమంటే, చిత్తవృత్తినిరోధము. చిత్తవృత్తులను అరికట్టేవి. అపుడు ఏబాధనూ ఉండదు, ఎవరు దూషించినా, ఎవరు స్తోత్రము చేసినా, మనఃశాంతిని మాత్రం పోగొట్టుకొనకూడదు. ఇంద్రియనిగ్రహము చేకూరితే, మనశ్శాంతిసిద్ధించును. దీనికి యోగసాధన అవసరము. మీకు యోగాసనములను నేర్పించుటకు ఏర్పాటు చేస్తున్నాము. దానివలన ఆరోగ్యము ఉత్తమమగును; బాధలను నివారించే శక్తి కూడ దొరకును.

ఆధిదైవికదుఃఖమును దూరము చేసుకొనుటకు సమాధిస్థితిని సంపాదించవలెను. ఆ దుఃఖమనగ దైవమువలన కలిగే అతి వృష్టి అనావృష్టి మొదలైనవి. వీటివలన, మానవుని మనస్సులో భయము తృత్తియై, వాడు చాలా బాధపడును. సమాధి అంటే క్రిందపడటము, తన్మయత్వములో పడి చేతులు కాళ్లు ఆడించటము, అస్పష్టముగా మాట్లాడటము ఇవి కావు. ధీ అంటే బుద్ధి; సమ అంటే, సమత్వముగా. ఏరు పేరు లేకుండ, క్రుంగక పొంగక, బుద్ధిని సమత్వంగా

నిలుపుట, అదే నిజమైన సమాధి. దానిని సంపాదించాలి.

ఈ స్థితిని నిర్వికల్పస్థితి అనికూడా చెప్పుదురు. సంకల్ప వికల్పములులేనిదే నిర్వికల్ప సమాధి. గుణములకు అతీతమైనపుడే సమత్వ భావన దృఢమయ్యేది. చీకటి పోవాలంటే, వెలుతురు రావాలి; పాపపరిహారానికి పుణ్యకర్మలు చెయ్యాలి. అట్లనే, శాంతి సంపాదించుటకు సంకల్పశూన్యుడు కావాలి. సంకల్పములే మనోవికారమునకు మూలకారణము; మనస్సు వికారమైనచో మానవాకారమే నాశనమగును; మానవాకారము కలుషితమైనచో మాధవత్వం సిద్ధించదు. తనలో మాధవత్వమున్నదనే సత్యాన్ని మరచిపోతాడు.

ఎట్టి మూర్ఖులుకూడ బంగారము, వెండి, వజ్రములు వీటిని ఇంటి బయట పారవేయడు. ఇంటిలో పల భద్రమైన పెట్టెయందే పెట్టి కాపాడుదురు. తట్ట బుట్ట కుండ మొదలగు వస్తువులుమాత్రం బయటనే ఉండును. అట్లనే, అమూల్యమైన ఆత్మను పవిత్రహృదయమందు ఎవరికీ సులభముగా కనపడని స్థలమందు భగవంతుడు ఉంచాడు. దేహము పాంచభౌతికము; అది కూలక తప్పదు; కాలక తప్పదు. దేహమే దేవ దేవుడు. దేవుని ఆశ్రయించిన, దుఃఖముండదు. ఆత్మయొక్క విలువ సిద్ధార్థ, భగీరథ వీళ్ళకు తెలుసు. వారు రాజ్యాధిపత్యమునే విసర్జించి అరణ్యమున నివశించి అనేక విధములుగా తపస్సునాచరించి, ఆత్మదర్శనమునార్జించి ఆనందమయులైనారు. ఆత్మవిద్యా విద్యానాం అన్నారు.

లోకవ్యవహారముకొరకు మీరు ఫిజిక్స్, కెమిస్ట్రీ, బాటని మొదలైన విద్యలనభ్యసించే తీరాలి. వాటిని చదువ వద్దని చెప్పటములేదు; జీవనోపాధికి అవి అవసరమే. అవన్నీ ఆధేయమైన కొమ్మలు రెమ్మలు ఆకులు పుష్పములు కాయలు. వాటిపై నీరు పోసిన ప్రయోజనముండదు. కనిపించని వేర్లకు నీరు పోసితే, కనిపించు కొమ్మలు రెమ్మలు బాగా పెరుగును. కాబట్టి, మీరు ఈవయస్సునందే, దానినికూడ తెలిసికొనుటకు ప్రయత్నము చేయవలెను. నిత్యానందమునకు, సమాధి స్థితికి, సమత్వదర్శనమునకు, అదే ముఖ్యమైన సాధన.

—శ్రీవారి దివ్యబోధ. కాలేజిహాస్టల్
బృందావనము 12-7-80

## గమనిక

ప్రతి సంవత్సరం నవంబర్ నెలలో ప్రపంచమంతటా శ్రీ సత్య సాయి సేవాసంస్థలు జరిపే 24 గంటల అఖండభజన, ఈ సంవత్సరం నవంబర్ 8వ తేదీ సాయంత్రం 6 గం॥నుంచి, 9 వ తేదీ సాయంత్రం 6 గం॥వరకూ జరుగును.

సంపాదకుడు

# నర నారాయణ

నీటియందే పుట్టి నీటియందే నిలచి
నీటియందే అడంగు నీటి బుడగ
నరుడు బుద్బుదంబు నారాయణుడు నీరు
సత్యమైన మాట సాయి మాట

జలమునందు పుట్టిన బుడగ, జలమునందే సంచరించి జలమునందే జీవించి జలమునందే ఐక్యమైనట్లుగా ఆనందమునందే పుట్టిన మానవుడు ఆనందమునందే జీవించి ఆనందమునందే సంచరించి ఆనందమునందే లయమొందడమే నిజమైన జీవితాంతరార్థము. ఈ దృశ్యకల్పితమైన జగత్తునందు, పంచభూతమిశితమైన జగత్తునందు పంచప్రాణములతో పంచకోశములతో, జీవించు మానవుడు నిజముగా నిరంతరానందమునందుకోవడం సాధ్యమా? అని సందేహించనక్కర లేదు. మనము ఎక్కడ నివసిస్తున్నాము? భూమి, భూమా. ఛాందోగ్య ఉపనిషత్తునందు భూమా అంటే, దైవతత్వం, బ్రహ్మతత్వం, ఆత్మతత్వం. ఆత్మయొక్క సహజ స్వభావమే, ఆనందము. అది నిరంతరము ఆనందస్వరూపమే. 'నిత్యానందం పరమ సుఖదం కేవలం జ్ఞానమూర్తిం ద్వంద్వాతీతం గగన సదృశం తత్వమస్యాది లక్ష్యం ఏకం నిత్యం విమలం అమలం సర్వధీ సాక్షిభూతం భావాతీతం త్రిగుణరహితం....భూమం'...కనుక, ఈభూమానందమును పొందుతూ దుఃఖమునకు కించితైననూ అవకాశము నందించకూడదు. కేవలము మాయయందు మునిగి, అజ్ఞానమును జయించక, స్వార్థమునకు క్రుంగి మానవుడు దుఃఖమునందు కుమిలిపోతున్నాడు. ఆశలన్నీ క్రమక్రమంగా తృష్ణలుగా మారిపోతున్నాయి; తరువాత విచారముగా రూపొందుచున్నాయి. విచారములన్నియూ వాసనలుగా నిలిచిపోతాయి. వాసనల వలన దుఃఖము మరింత అనివార్యమగును.

కనుక, మన వాంఛలను క్రమక్రమేణా అణగద్రొక్కే ప్రయత్నమును అభ్యసించాలి. దుఃఖమునకు గురియైన మానవుడు కోప తాప ఈర్ష్యాసూయలకు కూడా సులభముగా లొంగుతాడు. నిజముగా తన నిజస్వరూపాన్ని తత్వాన్ని గుర్తించిన వాడు ఈ విధమైన బలహీనతకు గురికాడు. మతములన్నియు దీనినే బోధించుచున్నవి. మన భేదభావములు దుఃఖ కారణములు. ఇవన్నియును మన మతులలో చేరినవే గానీ మతములు భేదమును బోధించలేదు. భోగభాగ్యముల వెంట ప్రయాణము చేసి, మానవత్వమునే మరచి పతనమయ్యే జీవితమునకు మతము కాదు, మతియే కారణము. కలిమి గలిగినవాడు కైలాసపతినైన లెక్కచేయడు; కలిమి తరుగగానే లోకము కనపడును. దీనినే వేమన కూడనూ చిన్న వాక్యములతో చెపుతూ వచ్చాడు:

ధనమెచ్చిన మదమెచ్చును
మదమెచ్చిన దుర్గుణంబు మానక హెచ్చున్
ధనముడిగిన మదముడుగును
మదముడిగిన దుర్గుణంబు మానును, వేమా!

అన్నాడు నిజముగా, ఇందు మన అహంకారముగానీ అధికారముగానీ, ఆడంబరముగానీ, ధనకనకవస్తువాహ

నాదులు కానీ క్షణికసుఖమునే అందించగలవు. "శృణ్వంతు విశ్వే అమృతస్య పుత్రాః" నేను అమృత పుత్రుడు అనే అహంకారమే, సరైన ఆత్మతత్వము పదవులుకానీ, జనబలము ధనబలముకానీ, భుజబలము బుద్ధిబలముకానీ, కాలాంతరములో కరగిపోతాయి-ఇవ న్నీసత్యము కాదు; నిత్యము కావు. ఇవన్నీ కదలిపోయే మేఘములవంటివి. కరగిపోయే చంద్రునివంటివి. క్షీణించిపోయే వెలుతురువంటివి. అయితే, భూమా అగు ఆత్మ నిత్య శుద్ధం, నిత్య సత్యం, నిత్య జ్ఞానం.

లోక సంబంధమైన అనుబంధములను ప్రతిబంధము లను బంధుత్వములను విశ్వసించి, నిజబంధువైన ఆత్మను దూరం చేసుకోకూడదు. చెరువునందు నీరు నిండుగా వుండినపుడు కప్పలు వేలు వేలుగా చేరును; ఆ నీరు ఇమిడిపోగానే, ఒక కప్పఅయినా చెరువు నందు నివసించదు. ఇదే విధముగనే, సర్వవిధము లైన అధికారములు సిరిసంపదలు మన వెంట తుల తూగుతున్న సమయమునందు అందరూ మిత్రులే, అందరూ బంధువులే. ఉన్న ధనమేమైనా తొలగెనా, ఒక్క బంధువైననూ ఒక్క మిత్రుడైననూ పలుక రించేవాడుండడు. చుట్టములందరూ వాకిటిదాకనే వల్లకాడు వరకే వత్తురు. బంధమణచి విడుబాయని ఆపద్బంధువు భగవన్నామమే; ఇట్టి విశ్వాసమును గట్టిగా ప్రయత్నపూర్వకంగా సాధించాలి.

ఎంతకాలమైనా లౌకికవిషయములందు, లౌకిక ఆచారములయందు లౌకిక ఆరాధనలయందే కాలమును వ్యర్థంచేయకూడదు. క్రైస్ట్ మొట్ట మొదట నేను భగవ ద్దూత అన్నాడు. తరువాత, రెండవ స్థాయియందు నేను దేవుని కుమారుడు, అన్నాడు. మూడవస్థాయి యందు, నేనూ నా తండ్రియూ ఒక్కరే అన్నాడు. మాకిద్దరికీ అవినాభావసంబంధము అన్నాడు. జోరా స్ట్రియన్ మతమునందు, ఇస్లాం మతమునందు కూడ, ఆధ్యాత్మిక సాధనలవలన మానవుడు ఒక స్థాయినుంచి మరొక ఉన్నతస్థాయిని పొందుటకు వీలున్నది, అనే బోధనవున్నది. నేను జ్యోతిలో వున్నాను, అనే స్థాయినుంచి జ్యోతి నాలోవున్నది అనే భావము అభి వృద్ధియై నేనే జ్యోతి, జ్యోతియే నేను అనే నమ్మ కము దృఢమగును. దీనినే వేదాంత పరిభాషలో సత్, చిత్, ఆనందం అని వివరింపబడు తున్నది.

సర్వమతముల సారము, సర్వమతముల గమ్యము, సర్వమతముల కీలకము ఏకత్వమైన ఆత్మతత్వమే, అని విశ్వసించాలి. ఇట్టి విశ్వాసమును బలపరచుటకై ఆచారములు నియమములు నిష్ఠలు కర్మలు మొదలగు నవి ఏర్పడినవి. కానీ, చిత్త శుద్ధికంటే వేరేమియును ఇవి సాధించవు. అల్పతృప్తుల నిమిత్తమై ఆచరించే ప్రక్రియలు ఇవి. మొట్టమొదట, పుష్పమును పోషి స్తాము; అది కాయగా మారుతుంది, కొంతకాలము నకు, కాయ ఫలముగా మారును. ఫలమునందే మాధుర్యముచేరి ఆనందమునందించును. మనలోని ప్రేమతత్వమే మాధుర్యము.

క్రమక్రమముగా వ్యక్తిత్వమనే స్వార్థతత్వమును నిర్మూలపరచి తద్వారా సమిష్టిస్వరూపమైన ప్రేమ తత్వమును పెంచుకోవడంలో ఎంతైనా సన్నిధిని సంపాదించుకొనుటకు వీలున్నది, ప్రేమతత్వమే సాక్షాత్ శివతత్వము.

—దివ్యబోధ 27-10-79.

# దుఃఖ నివృత్తి

తనను తాను తెలుసుకోలేకపోవడమే పెద్ద బంధన. ఈ బంధనను సమగ్రతపూర్వకంగానే సాధించుటకు సమాజము అత్యవసరము. ఏనాడు తనను తాను తెలుకొనలేదో, మానవునకు దుఃఖము తప్పినది కాదు. దుఃఖముండినంతవరకును ఆనందము లభ్యము కాదు. కనుకనే దుఃఖముయొక్క అంతర్భూతిని గుర్తించుకోవడం అత్యవసరం. దుఃఖములు మూడు విధములుగా ఉంటున్నవి. ఒక్కటి, అసత్తు దుఃఖం, రెండవది తమస్సు, మూడవది మృత్యు ఏతావాతా అసత్తు, తమస్సు, మృత్యు ఈ మూడు కూడనూ జగత్తు, జీవ, ఈశ్వరత్వము అనే మూడు స్థానములను అనుభవిస్తున్నవి.

ఈ జగత్తు అనేది ఏమిటో మనము కొంతవరకు గుర్తించాలి. మానవునకు మరువవలసినదానిని మరువనంతవరకును దుఃఖము తప్పినది కాదు, కనుక మరువలవచిన దానిని మరచినప్పుడే మానవునకు ఆనందము. తెలుసుకోవలసినదానిని తెలుసుకునప్పుడే ఆనందము. చేరవలసినదానిని చేరినప్పుడే ఆనందము.

మరువవలసినది ఏమిటి? జగత్తు భావము మరువవలెను. జీవతత్వము అనేదేమిటో తెలుసుకోవలెను. బ్రహ్మములో చేరవలెను. మానవత్వమనగా దివ్యత్వముతో కూడిన ఆత్మతత్వమనే సత్యాన్ని ప్రతివ్యక్తి గుర్తించవలెను. కనుకనే జగత్తు భావమును మరచి జగదీశ్వరభావాన్ని ఏనాడు గుర్తింతుమో, ఆనాడే ఆనందాన్ని అనుభవించవచ్చును. జగత్తుతత్వము జీవతత్వము, ఆత్మతత్వము అవినాభావసంబంధము.

ఇది వస్త్రము; వస్త్రము కాదు. దారము; దారము కాదు; ప్రత్తి! ప్రత్తివలననే దారము. దారమువలననే వస్త్రము. కనుకనే ఆత్మఅనే ప్రత్తి జీవ అనే దార స్వరూపాన్ని ధరించి వస్త్రముఅనే జగత్తుగా ప్రకటిస్తూ వస్తున్నది. కనుక ఆత్మతత్వాన్ని మరచిన, అనగా ప్రత్తినే మరచిన దారములేదు. వస్త్రము లేదు. ఆత్మతత్వమే ఆధారమైన జీవతత్వాన్ని మనం గుర్తించుకోవాలి. ఈ నిమిత్తమై, ప్రకృతిని ఆదర్శంగా తీసుకుని, నిత్యజీవితాన్ని గుర్తించుకుని వర్తించడం అవసరం. దీనినే ఉపనిషత్తులు అసతోమా సద్గమయా, తమసోమా జ్యోతిర్గమయా, మృత్యోర్మా అమృతం గమయా అన్నాయి. భారతీయుల దృక్పథం అసత్తు నుంచి సత్తునకు ప్రయాణం చేయడం కాదు; lesser truth, to higher truth. Truth to truth. సత్యస్య సత్యం; సత్యమునుంచి సత్యమునకు ప్రయాణం చేయడమే. మానవత్వమనే స్థాయినుండి దైవత్వమనే గమ్యమును చేరేనిమిత్తమై ప్రకృతిని ఉపాధిగా అనుసరించడం అత్యవసరం.

ప్రతి మానవుడు కూడనూ, రూపసాదృశ్యములో అనేక విధఅందచందములతో కూడినప్పటికీ, పూర్ణత్వమైన మానవత్వమును ఏ మానవుడు కోల్పోవునో అట్టి మానవుడు కేవలము ఆకారమానవుడేకానీ నిజమానవుడు కానేరడు. ఏ విశిష్టవిజ్ఞానము సర్వ జంతు సామాన్యమునుంచి వేరు చేసి మానవుని అధికముగా భావించుచున్నదో అట్టి జ్ఞానమును మానవుడు ఈనాడు మరిచిపోవుచున్నాడు.

ఈనాడు మానవుని జీవితమును భౌతికమనియు, ఆధ్యాత్మికమనియు రెండు భాగములుగా విభజించి అనుభవిస్తున్నాము. ఈ విభాగము సరికాదు. కారణమేమనగా ఆధ్యాత్మికము లేని భౌతికము, భౌతికము లేని ఆధ్యాత్మికము విలుచుటకు వీలుకాదు. అవి రెండూ నెగెటివ్ పాజిటివ్ వంటివి. ఆధ్యాత్మికము ఆవరించినదే భౌతికము; భౌతికాన్ని ధరించినదే ఆధ్యాత్మికము. ఆధ్యాత్మికము, భౌతికము అని విభజించి జీవితమును కేవలము సంకుచితమైనదిగా రూపొందింప చేసుకోవడము సరికాదు.

మానవుడు దేహము, ఇంద్రియములు, మనస్సు, బుద్ధి అనే ఉపాధులను ధరించి ఉంటున్నాడు. ఇది నా దేహము అన్నంతమాత్రాన నేను దేహము కాను. ఇది నా టంబ్లర్ అనుకున్నప్పుడు టంబ్లర్ నేనెట్లు కాగలను? కనుకనే ఇది మా దేహము అనుకుంటున్నాము, కాబట్టి దేహము మనం ధరించిన ఉపాధి. ఇవి నా ఇంద్రియములు అనుకున్నప్పుడు నీవు ధరించిన ఇంద్రియములేకానీ, నీవు ఇంద్రియములు కావు. ఇది నా మనస్సు అనుకున్నప్పుడు అది నీవు ధరించిన ఉపాధే కానీ నీవు మనస్సు కాదు. కనుక దేహము, మనస్సు, ఇంద్రియములు, బుద్ధులయొక్క రహస్యాన్ని మనం గుర్తించడం ప్రపథమంలో అత్యవసరం. దహ్యతీతి దేహం: అనగా దహింపబడేటటువంటిది దేహమని అర్థము. మరణించినతరువాత దహింపచేయడమే కాదు జీవకాలమునందే చింతలచేత దహించిపోతున్నది దేహము. చితి అనే అగ్ని శవాన్ని భస్మం చేస్తున్నది. చింత అనే అగ్ని జీవితాన్నే భస్మం చేస్తున్నది. కనుక దేహభ్రాంతిని చింతలచేత మరువలేక జీవితాన్నే భస్మంగావించుకుంటున్నాము.

దీనికి శరీరము అని మరొక పేరు. 'శర్యతీతి శరీరః' శరీరమనగా జీర్ణించిపోవునది; ఏ విధంగా? రక్తపుముద్దవలె పుట్టి, బాల్యములో కోమలంగా పెరిగి, యౌవనంలో ఆకర్షణరీతిగా సౌందర్యాన్ని అనుభవించి, వృద్ధాప్యంలో వికారాన్ని చెందుచున్నది. ఈ శరీరము: షడ్వికారములతో కూడిన శరీరమునకే క్షేత్రము అని మరొక పేరు. క్షేత్రమనగా భూమి ఇందులో జీవుడే రైతు. జీవుడనేవాడు పాపము అనేబీజములు చల్లుకున్నప్పుడు పాపఫలములే లభిస్తుంటాయి. పుణ్యము అనే బీజములు చల్లుకున్నప్పుడు పుణ్యఫలములే లభిస్తుంటాయి. కానీ "పుణ్యస్య ఫలమిచ్ఛంతి పుణ్యంనేచ్ఛంతి మానవాః, న పాప ఫలమిచ్ఛంతి పాపం కుర్వంతి యత్నతః" అని సన్మార్గమునకు విరుద్ధంగా నడుస్తున్నాడు. పాపము చేయడానికే ముందంజవేస్తున్నాడు; పాపఫలములు ఆశించడు. పుణ్యము చేయడానికి ముందుకు రావడం లేదు. పుణ్యఫలములు మాత్రం ఆశించుతున్నాడు. క్షేత్రమైన దేహమునందు సత్యమైన, పవిత్రమైన, నిత్యమైన, ఉపకారమైన, దివ్యమైన, భవ్యమైన, నవ్యమైన భావములను అభివృద్ధి పరచుకోవాలి.

ఈ దేహమునే 'దేహోదేవాలయప్రోక్తో, జీవో దేవస్సనాతనః' దేహమనేది ఒక దేవాలయము; కనుకనే క్షేత్రము. కాశీ క్షేత్రము, ప్రయాగక్షేత్రము, తిరుపతి క్షేత్రము అనే పేర్లు పవిత్రమైన దివ్యమైన దైవత్వముయొక్క నివాసములు కనుకనే సార్థకాన్ని అందుకోగలుగుతున్నవి. కనుకనే ఈ క్షేత్రములో దివ్యత్వము ఆత్మరూపములో ఉన్నది; కనుక ఎంత పవిత్రంగా ఉపయోగపెట్టుకోవాలో ఒక్కతూరి గుర్తించుకోవాలి. క్షేత్రమనే దేహమును నిత్యము పరిశుద్ధము చేసి పవిత్రమైన వాతావరణంతో నింపుకోవడానికి ప్రయత్నించాలి. పరిశుద్ధమనగా కేవలము దినమునకు పదిపర్యాయములు స్నానం చేసి, ముట్టద్దు ముట్టద్దు, అనే మూఢాచారములో పోవడం కాదు. జలముచే దేహము

మాత్రమే పరిశుద్ధమవుతున్నది. వాక్కు పరిశుద్ధికూడా ఉండాలి. సత్యముచేత వాక్కు పరిశుద్ధం చేయాలి. విద్యాతపస్సులచేత జీవతత్వాన్ని పరిశుద్ధం చేయాలి. జ్ఞానంచేత బుద్ధిని పరిశుభ్రపరచాలి. దేహము జడమైనది కానీ చైతన్యమైనది కాదు. చైతన్యమనే ఆత్మతత్వమే లేకపోతే శరీరము, ఈ దేహము, ఈ క్షేత్రము, ఈ దివ్యమందిరము నిరుపయోగమైపోతుంది. మనం శరీరముయొక్క తత్వాన్ని చక్కగా గుర్తించుకున్నప్పుడు, దేహభ్రాంతికి, దేహబంధనకు దూరం కావడానికి అవకాశముంది

లేనిపోని దురాశల చేత, నిరాశకు, నిస్పృహకు గురియై అనేకవిధములైన దుఃఖములు కూడనూ తెచ్చిపెట్టుకుంటున్నాము. జీవిత ప్రయాణమునందు కోరికలనే లగేజీను క్రమ క్రమేణా తగ్గించుకోడానికి ప్రయత్నించాలి.

ఇంద్రియములకు ఉపనిషత్తులయందు మాత్రః అనగా కొలత వేయబడిన శక్తి గలిగినది, అని పేరు. పప్పు తింటున్నాము; పప్పులో ఉప్పు ఎక్కువా తక్కువా అన్నది నాలుక నిర్ణయం చేస్తున్నది. అదే విధముగనే కన్ను అందమును చూస్తుంది. ఆహా! మనిషి చక్కగా ఉంటున్నాడు కానీ ముక్కు చక్కగా లేదే అని నిర్ణయాన్నిచేస్తుంది ముక్కుయొక్క కొలత వేసినటువంటిది కన్ను. ఇంక సంగీతం అతి మధురంగా ఉంటున్నది అతి శ్రావ్యంగా ఉంటున్నది అని చెప్పడం కానీ, లేక ఇది అపస్వరంగా ఉంటున్నదని కానీ నిర్ణయం చేసేవి చెవులు. ఇంద్రియములు అన్నీ ఇదేవిధముగా ఒక్కొక్క విషయాన్ని ఒక్కొక్క రీతిగా కొలతవేస్తూ పోతున్నవి. ఇంతియేకాక, మాత్ర అనగా 'పరిమితి' అని మరొక అర్థము. ఈ పరిమితి, ఏ విధముగా ఉండాలి ఈ ఇంద్రియములకు? భగవంతుడు ఆదేశించిన నియమాన్ని ఉల్లంఘించినప్పుడు కొంత బాధ పడవలసి వస్తుంది. కనుక మనం ఉచ్ఛ్వాస నిశ్వాసములను తీసుకుని జీవతత్వాన్ని పోషించుటకై అందించిన ఈ ముక్కుతో నశ్యం వేసుకోడానికి ప్రయత్నం చేస్తే ఇది దురుపయోగంకాదా? మన నాలుక పవిత్రమైన వాక్యములచేత, మృదుమధురమైన మాటల చేత, ఇతరుల హృదయాన్ని రంజింపచేసి తదుపరి సాత్వికమైన ఆహారాన్ని భుజించే నిమిత్తమై ఈ నాలుకను ప్రసాదించాడు భగవంతుడు. అట్లు కాకుండా ఇతరుల మనసును నొప్పించేటటువంటి కఠినమైన వాక్కులు చేయడం, పరదూషణను చేయడము, పరనిందలు చేయడము, సాత్వికమైన ఆహారమును భుజించక రాజసిక, తామసిక ఆహారమును భుజించడము ఇది పెడమార్గము పట్టినట్లు కాదా? కనుక మత్తు మాంసాదులను భుజించేనిమిత్తమై మనకీనోరును ప్రసాదించలేదు భగవంతుడు. పరులను దూషించి, పరులను నిందించేనిమిత్తమై మనకు ఈ నాలుకను అందించలేదు భగవంతుడు. కనుకనే ఈవిధంగా సక్రమమైన మార్గము చేత మన ఇంద్రియములను పవిత్రం గావించుకున్నప్పుడే మన మానవత్వము సార్థకం అవుతుంది. ఇంద్రియములన్నియూ స్వతంత్రమైనవి కావు. విషయములతో సమ్మిశితమైనప్పుడే ఇంద్రియములు ఉపయోగపడుతున్నవి. విచారమైన వార్తను విన్నప్పుడు దుఃఖం ప్రారంభమవుతుంది. ఆనందమైన వార్తను విన్నప్పుడు ఆనందం, సంతోషం లభిస్తుంది. కనుక చూడకుండినంతవరకు మనకుదుఃఖము లేదు ఆనందము లేదు. ఇంద్రియములు విషయములతో సమ్మిశితము గావడం చేతనే సుఖదుఃఖములు మనకు సంప్రాప్తమగుచున్నవి. మానవునకు ప్రసాదించిన ఇంద్రియములన్నియూ కూడనూ మంచిని చూసి, మంచిని చేసి, మంచిగా ఉండి, మంచిగా జీవించడంకోసమే అనుగ్రహించాడు. ఇదే దైవత్వానికి సరియైన మార్గము.



—శ్రీవారి దివ్యబోధ

# ఆధ్యాత్మిక సాధన

భగవాన్ సత్యసాయిబాబా బోధలన్నీ అనేక వాహినులుగా వెలువడి సాధక హృదయ క్షేత్రాలలో దివ్యానుభవముల పంటలను పండిస్తున్నాయి; అలాటి వాటిలో జ్ఞానవాహిని ఒకటి. జ్ఞానవాహినిలో స్వామి వెలిబుచ్చిన సాధక లక్షణాలనూ, సాధన రీతులనూ, సిద్ధావస్థనూ గుర్తించుటే ఈ సంక్షిప్త రచన ఉద్దేశ్యము.

సాధక లక్షణాలు: సాధనలు వేర్వేరుగా భావింపబడటంవల్ల సాధకలక్షణాలు కూడా వేర్వేరుగా వుంటాయనీ, సాధనారీతుల్లోనూ సాధకులలోనూ తరతమ భేదాలుంటాయనీ మనం అనుకుంటూ వుంటాం. ఎలాటి సాధన చేస్తున్నప్పటికీ సాధకులందరిలోనూ వుండవలసిన సాధారణ ధర్మాన్ని స్వామి యిలా వివరిస్తారు:—

"సాధకుడు మనస్సును నిద్రలోనికి పోనివ్వక ఆత్మవిచారణయందే నిలుపవలెను." (1వ ప్రబోధ.)

"సాధకుడు ప్రపంచ ధోరణిని త్యజించి, అంతర్ముఖుడై, ఆత్మయందు దృష్టిని మరలింపవలెను.... సాధనకు మొదట పవిత్రత, చిత్తశుద్ధి ముఖ్యము. లోకమున అందరూ సాధకులవలె కనిపింతురు. కానీ గుణసంపత్తి కలవారు అరుదు!" (2వ ప్రబోధ.)

"సాధకుడు మెలకువగానుండవలెను. ఇంద్రియముల తిరుగుబాటు యెప్పుడైననూ, యేనిముషమైననూ రావచ్చును....ప్రపంచ ధోరణియందుండు వారితో కలియుట యెక్కువ పొరపాటు. యెల్లప్పుడును తత్త్వజ్ఞానాభ్యాసమునందే మునిగి యుండవలెను." (8వ ప్రబోధ.]

"నిజమైన సాధకుడు తన యావచ్ఛక్తిని ప్రపంచ విషయములనుండి, యింద్రియ భోగములనుండి మరల్చి శాశ్వత బ్రహ్మమునుగూర్చి విచారించుచూ అదే గొప్ప తపస్సుగా చేయుచుండును"(4వ ప్రబోధ.)

"అజ్ఞానులగు సాధకులు స్థూలశరీరము, మనస్సు దాని వృత్తులతోనే ఐక్యమగుచున్నారు. వాస్తవమునకు ఈ శరీర మనస్సులు పరికరములు మాత్రమే" (7వ ప్రబోధ.)

సాధకుల లక్షణములను పైరీతిగా వివరించిన స్వామి సాధకులకు కావలసిన అర్హతను ఇలా తెలియజేస్తారు.

"అజ్ఞాన నివృత్తి చేసుకొనగోరువారు ఎవరైననూ సరే జ్ఞానమును సాధింపవచ్చును....ఏతెగవారయిననూ జ్ఞానమును సాధించుటకు అధికారులే. ఎట్టివారికయిననూ వారి సాధన, తపస్సులె కారణములు కాని జాతి మత లింగభేదములు కారణములు కావు."

"ఒకరికి ఆత్మనిష్ఠలో అధికారము కలదనియు, మరియొకరికి జ్ఞాననిష్ఠలో అధికారము లేదనియు చెప్పుటకు ఈశ్వరునికి తప్ప మరెవ్వరికీ అధికారములేదు. ఇంకనూ లోతుగా యోచించిన తనను పొందుటకు నీకు హక్కులేదని ఈశ్వరుడుకూడ చెప్పలేదు" (6వ ప్రబోధ.)

సాధన: కొందరు సాధన చేయరు, కువిమర్శలు మాత్రం చేస్తూవుంటారు. వారినిగూర్చి స్వామి యిలా అంటారు:—

"అజ్ఞానముచే పరబ్రహ్మకు అతిదూరముగా నుండిన ఆ దూరవస్తువును చూడగోరిన భూతద్దమెట్లు అధా

రమో అదేరీతిగా సర్వభూతాంతరాత్మ అయిన పర బ్రహ్మను చూడగోరిన జ్ఞానదృష్టి ఆధారము.

''అట్టి దృష్టిని సంపాదించుకొను శక్తి, సాధన చేయక అది నేను నమ్మను అన్న అది అమాయకుల యిన పసిపాపల లక్షణము.'' (7వ ప్రబోధ)

"సాధనను పూర్తిగా సాగించుటకు ప్రయత్నము చేయుడు. సారమును వెతుకుటకు సాహసింపకుడు, ఇది జ్ఞానులు పడవలసిన జాగ్రత" (8వ ప్రబోధ)

"వాంఛలను విసర్జించుట, మనస్సును నిర్మూలిం చుట, తత్త్వజ్ఞానము ఈ మూడును కలిపి సాధన చేయవలెను. అప్పుడే ఆత్మజ్ఞానము లభించును.'' (8వ ప్రబోధ)

''నేనెవడు'' అను విచారణ, 'అహంబ్రహ్మాస్మి' అనే మహావాక్యవిచారణ, 'శుభేచ్ఛ' అనెడి త్రివిధ సాధనా రీతులద్వారా సకలకోరికలు నశించుట, మనస్సు పవిత్రత చెందుట, తత్త్వ జ్ఞానప్రాప్తి యగునని స్వామి 3వ ప్రబోధలో విశదీకరిస్తారు.

"బ్రహ్మ జ్ఞానమును అనుభవించుటకు ప్రయత్నిం చువాడు దేహమందలి భ్రాంతిని పూర్తిగా కోల్పోయి, దేహమును పాము విడుచు కుబుసమువలె నిర్లక్ష్య ముగా చూడవలెను....ఇట్టిని కేవలము ఆత్మ బలహీ నత గలవారిలో తెలిసికొన సాధ్యముకాదు, ఆత్మ చింతన వలన క్రమేణా ప్రాపంచిక వ్యవహారము లనుండి బయట పడగలము. దీనికి ఎక్కువ ఓర్పు, సాధన కావలెను.'' (4వ ప్రబోధ)

సరియైన సాధన, శిక్షణ పొందని వారు దేహ మునే పరబ్రహ్మముతో పోల్చుచుందురు.'' (4వ ప్రబోధ)

''భక్తి, జ్ఞాన వైరాగ్యములు వేరువేరుగా తలంచి ద్వేషించుచున్నారు. ఆ మూడింటినీ కలిపి సాధన సలిపిననే గమ్యము తెలుసుకొనగలరు. భక్తిలో జ్ఞాన విరాగములున్నవని నిరూపింపవలెను... భక్తిజ్ఞానం లేని వైరాగ్యం, వైరాగ్యము జ్ఞానము లేని భక్తి గమ్య మునకు చేరదు. సాధకులు ఈ త్రివేణిలో మునిగిననే ఫలితము చేజిక్కును. ఇట్టి సాధనకు మొదట పవి త్రత చిత్తశుద్ధి ముఖ్యము.'' (7వ ప్రబోధ)

"శ్రవణ ప్రకరణమును శ్రద్ధ పరామర్శించి చూచువారు ఆత్మతత్త్వమును పరోక్షముగా తెలిసి, దానిని అపరోక్షముగా నెరుగుటకై సాధనముగ నుండు మననము నపేక్షించును.'' (10వ ప్రబోధ).

సాధకుల లక్షణాలనూ, సాధననూ వివరించిన తర్వాత జ్ఞానవాహినిలో సిద్ధావస్థను పొందిన మహా త్ములను గూర్చి కూడా తెలియజేస్తారు స్వామి! సాధకుడు – సాధన – సాధ్యస్థితి అనే ఈ త్రిపుటిని విశదీకరించుతుంది జ్ఞానవాహిని.

సిద్ధావస్థ :—''ఆత్మ జ్ఞానోదయ మొక్కటే అన్ని తృష్ణలను నిర్మూలింపగలదు. అట్టి జ్ఞానియొక్క స్వానుభవము నేను బ్రహ్మము అని పలుకునప్పుడు మనస్ఫూర్తియగు సత్యమును నుడువుచున్నాడు. స్థూల సూక్ష్మ శరీరములు, మనోబుద్ధి ప్రాణములు మొదలగు నవన్నియు త్యజించి, వాటికి అతీతంకాగలిగినప్పుడు మిగిలియుండునది సత్తు లేక పరబ్రహ్మము కదా! కావున సర్వవ్యాపియైన సర్వేశ్వరునే తానుగా పోల్చు కొనుచున్నారు." (4వ ప్రబోధ)

''భగవత్ ఘనతలు ఎట్లు అసాధ్యములో తనను తెలుసుకొని తనలో లీనమయిన వాని ఘనతలు అట్టివే, అతనే బ్రహ్మమగు చున్నాడు." (8వ ప్రబోధ)

జ్ఞానవాహినిలోగల పన్నెండు ప్రబోధలలోనూ గల ఆధ్యాత్మిక సాధనను గూర్చి, సాధ్యతత్త్వాన్ని గూర్చి సాధకులు శ్రవణంద్వారా, మననంద్వారా, ధ్యానంద్వారా అనుభవంలోకి తెచ్చుకోవటమే కర్తవ్యం!

పాతూరి ప్రసన్నం

# గురువులు, శిష్యులు

ప్రేమస్వరూపులారా! ప్రతిప్రాణికీ పరిపూర్ణత నొందటమే విధి. ఎన్ని జన్మలెత్తినా ఏరీతి జీవించినా, చివరకు ఆ స్థితిని పొందియే తీరవలెను. ఎపుడు ఎట్లు అనేది, పూర్వజన్మ కర్మలపై ఆధారపడి యున్నది; ఆ కర్మల వెనుక నున్న భావాలపై రూపొందును. కర్మభావ ఫలితమే నేటి పరిస్థితి. నేటి కర్మ భావ ఫలితము భవిష్యత్తు. మన అదృష్టమునకు మనమే కర్తలము. ఈ అదృష్టనిర్మాణకార్యములకు పరుల సహాయము అవసరమా? పరిపూర్ణ పారమార్థికస్థితి ఉన్నతస్థాయిని పొందుటకు పరుల సహాయ మవసరమే. అది గ్రంథపఠనము నుంచి లభించునది కాదు. ఒక హృదయమునుంచి మరొక హృదయమునకు చేరవలసిన సంబంధ బాంధవ్యముల వలన కలిగే అభివృద్ధి అది.

గ్రంథావలోకనమువలన తర్కవితర్కాలు పెరుగును. బుద్ధిచే శక్తిసామర్థ్యములు వృద్ధి పొందుటకు వీలున్నది; కానీ, ఆధ్యాత్మికములో ముందంజవేయుటకు అనుభూతులే ప్రధానము. ఇట్టి అనుభూతులను హృదయమందు కలుగచేయుటకు, కరడు కట్టిన అజ్ఞానమును నిర్మూలం చేయుటకు, పారమార్థిక దివ్య ప్రభావము నందుకొనుటకు, గురువు అత్యవసరము. అది ఒక జీవతత్త్వమునుంచి మరొక జీవతత్త్వమునకు నేరుగా రావలసినదే. పరిపూర్ణమైన పవిత్రమైన ఆత్మ జ్ఞానము గురువు లేక అందదు. గురువులలో అనేక రకములున్నాయి, దీక్షాగురు, శిక్షాగురు అని. ఒక మంత్రమునుపదేశించిన వారు గురువు అని చెప్పటము ఆ పదమును అపార్థము చేసుకొన్నట్టే. అదొక ప్రాచీన సాంప్రదాయము. మంత్రమును ఉచ్చరిస్తున్నపుడు బహుమంది తమలోని దివ్యత్వమును విస్మరిస్తున్నారు. అయితే, తరతరాలనుంచి కోటి కోటి కంఠాలు స్తోత్రముచేయు గురువు శిష్యునికి శిక్షణ నందించి తీర్చిదిద్ది, వాని అంధకారమును నిర్మూలించిన వారు. 'గు' అంటే అజ్ఞానాంధకారం, 'రు' తన్నివారణం. ఇదే గురు పూర్ణిమయొక్క అంతరార్థము. పూర్ణిమ అంటే పూర్ణతత్త్వము, ఆత్మతత్త్వమే. ఆ అతీతమైన పూర్ణ తత్త్వము. పూర్ణమంటే, గుణతత్త్వములోని పూర్ణత్వము, Quality లో పూర్ణత్వం. చక్కెర పెద్ద ఖండము తీపు; అణువైననూ, అదే తీపు అగమ్యమైన అగాధమైన సముద్రముయొక్క రుచి తెలియుటకు దానిని పూర్తిగ త్రాగనక్కర లేదు; ఒక బిందువును నోటిలోవేసుకొంటే చాలు. అగాధరూపములోనూ అణు రూపములోనూ, పరమాత్మ ఏకరీతిగా సచ్చిదానంద స్వభావమే. ఇదే సచ్చిదానందము; దీనినుండి తీసిన బిందువుకూడ అదే సచ్చిదానందమే. ఘనస్వరూపము, అణుస్వరూపము—రెండూ పూర్ణమే. మానవులలోని ఆత్మ, పరమాత్మ రెండూ స్వరూపతః పూర్ణమే.

ఈ దినము పౌర్ణిమ, పూర్ణచంద్రునిలో మచ్చ కనబడదు. తెల్లదనము చల్లదనము ప్రధానమై యుండును, అజ్ఞానం, అంధకారం అనే మచ్చలు, మన సత్త్వముయొక్క ప్రతీకమైన చంద్రునిలో మనసత్త్వములోని దివ్యత్వము పూర్ణముగా ఈ నాడు ప్రకాశించుటకు వీలగును. గురువు ఎట్టివాడై ఉండాలి

భక్తి ప్రపత్తులతో సహనశాంతులతో పరిపూర్ణ తేజస్సుతో వెలగాలి. ఆచరణరూపమైన ప్రబోధతో అజ్ఞానమును నివారించే వారే గురువులు.

గ్రంథపఠనమువలన చిత్తశుద్ధి కావచ్చు, కానీ, విషయస్వరూపము అర్థం కాదు; అందున్న ఆత్మతత్వపరిజ్ఞానమునకు కీలకం, ధ్యానమువలన లభించే అనుభూతులే. మహాపురుషుల ప్రేమను సంపాదించి వారి ప్రబోధలను విని మననము చేసి నిభిధాసన మొనర్చితే మాత్రం అది సాధ్యము

ఈశ్వరుడే గురువులకు గురువు. ఈశ్వరానుగ్రహమువలన, గ్రుడ్డివాడు దర్శించగలుగుతాడు; కుంటివాడు పర్వతమును దాటగలుగుతాడు; మూగివాడు చక్కగా మాట్లాడటానికి అవకాశముండును. స్పర్శ ద్వారా కర్మఫలమైన పాపములన్నిటినీ నశింపజేసి పవిత్రముగా నిర్మలముగా తీర్చి దిద్దును.

అయితే, ఈశ్వరుని మానవరూపమందే మానవులు ఆరాధన సలుపాలి. మనలో మానవత్వభావమున్నంత వరకూ దానికతీతమైన దానిని కూడ దర్శించుట, అసాధ్యమైన పని. తన స్థాయికి అర్థంకాని, ఊహించుటకు సాధ్యంకాని రూపమును దర్శించుటకు ప్రయత్నముచేసితే, విఫలుడౌతాడు. నిరాకార నిర్గుణము అంటే ఏమి? వివరించండి అని అడిగితే, జవాబు శూన్యం. అద్భుత ఉపన్యాసాలు చెప్పవచ్చు. తర్కవితర్కాలలో విజయము పొందవచ్చు; అయితే, అవన్నియూ హాస్యాస్పదముగానే మిగులును. అట్టి ప్రబోధలన్నియూ సత్య శూన్యం. అవి వారి బుద్ధి చాతుర్యమును ప్రకటించే ప్రయత్నములు.

మానవత్వమునందు ఈశ్వరత్వమును దర్శించేది, చక్కని రాజబాట. ఆకారములో మునిగియున్నవాడు నిరాకారమును ఎట్లు నిరూపించగలడు? ఆకారమునే ఆధారముగా తీసుకొని, క్రమక్రమముగా నిరాకారమును అర్థము చేసుకొనుటకు వీలున్నది. అల్పబుద్ధులు భక్తి ప్రపత్తులు రహితులు మానవాకారమున దివ్యత్వము రాదు అని చెప్పవచ్చును కానీ అది సత్యసూక్తి కాదు. దైవం మానుషరూపేణ, అని అంటారు, కదా? దాని కోసమే, నరజన్మమును శ్రుతి స్మృతులు అంతగా వర్ణించును.

తన్ను తాను తెలుసుకోవటమే, పరమార్థము, పురుషార్థము. దేహభ్రాంతిగలవారు, బాలుడా వృద్ధుడా, స్త్రీయా, పురుషుడా, అని విచారణ చేయుదురు. ఇట్టి దేహభావమువదలి బ్రహ్మభావము రావాలి. ఇదికాదు. ఇది కాదు. అని చివరకు బ్రహ్మమేతాను, అనితెలుసుకోవాలి. దీనినే "నేతి నేతి ఇతి ఆత్మా" అని శ్రుతులు చెప్పుచున్నవి. జీవస్వరూపము ఆత్మయొక్క ప్రతిబింబమే. జీవి నిజముగా అమృత స్వరూపుడు. ఈ సత్యమును శంకరాచార్యులు ముచ్చటగా మూడుపదాలతో లోకానికి ఉపదేశించినారు. బ్రహ్మసత్యం, జగన్మిథ్యా. జీవో బ్రహ్మైవ నాపరా, అని. ఇదే బహుముఖ్యమైన ఆధ్యాత్మ ప్రబోధ—జీవుడు బ్రహ్మము గనేవున్నాడు. రెండిటికీ అవినాభావ సంబంధము. బ్రహ్మతత్వముతో కూడిన మానవత్వము హీనము కాదు, అల్పముకాదు, అపవిత్రముకాదు.

ఈ సత్యమును విశ్వసించక, మానవుడు అటు ఇటు కదలే సమయములో, జీవులకు గురువు అత్యవసరం, అట్టి గురువు వ్యాసుడు. వ్యాసుడు అంటే వ్యాప్తి గావించినవాడు. ఆత్మతత్వమును బోధించి అఖిల మానవులకు అందించిన వాడు, అని అర్థము. ప్రపంచ మంతా ఆవరించియున్న పరంజ్యోతిని తెలుసుకొనే ప్రయత్నమునకు మానవులను ప్రోత్సహించినవాడు, వ్యాసుడు. భారత భాగవతాదులను రచించి పదునెనిమిది

పురాణములను వ్రాసి, మానవులకు సుఖశాంతులు అందించే ఆరాధనా మార్గమును బోధించినాడు.

జగత్తును సృష్టించినా వాడే అపుడపుడు మానవాకారముతో అవతరించిన గాథలంతా వ్యాసుడు పురాణములందు తెలియపరచినాడు. తమోగుణము, రజోగుణము, సత్వగుణము మూడూ చేరి మానవాకృతి అయినది. సాత్వికగుణముచే దేవతలు, రాజసగుణములచే మానవులు, తమోగుణములచే దానవులు రూపొందిరి. మానవులకు బుద్ధికుశలత ఎక్కువ. వారికి తీక్ష్ణ జ్ఞానసిద్ధి లభించును. తమదివ్యత్వమును తెలుసుకొనే అవకాశముకలదు.

సృష్టియొక్క రహస్యము గురించి ఒక కథ: దేవతలు ఈశ్వరుని దగ్గరచేరి, ప్రభో ! సృష్టిరహస్యమును మానవులూ దానవులూ గ్రహించిన, మీ దివ్యత్వానికి హాని, దానివలన ఈ జ్ఞానమును ఆకాశములోనే పెట్టుతాము,'' అని చెప్పిరి. కాబట్టి, ఎవరూ దానిని గుర్తించలేదు, మానవులు ఆవేదనతో ప్రార్థించగా, దానిని జలములో దాచినారు. చివరకు, ఈశ్వరుడు వారి తపస్సుకు ప్రత్యక్షమై, అందరి హృదయ కమలములందు నిలిపిరి. అక్కడ, పంచభూతముల, పంచ ప్రాణముల, పంచకోశములలోపల ఆతత్వమున్నది. దానిని సాధనద్వారా అనుభూతికి తెచ్చుకోవలెను. విలువైన సొమ్ములను ఇంటిలోపల భద్రించేస్తారు. అట్లనే, ఆత్మతత్వమును అంతరంగములోనే వెతుకాలి. నౌకరిస్థితిలోవున్న వారికి అది దొరకదు; గృహయజమానుడుగా తయారుకావాలి; అపుడే, ఆత్మరత్నమునకర్హుడు. బహిర్దృష్టి ఉన్నంతవరకూ బానిసలే. అంతర్ దృష్టి సంపాదించిన తక్షణమే, గుహలోని ఆత్మాకారమందు జ్యోతిప్రకాశించి ప్రకటమగును. అహంకారము అసూయ ఆశలు మొదలగు మేఘాలు ఆ ఆకాశములో సంచరించిన జ్యోతి మరుగు పడును.

గురుపూర్ణిమ అంటే, అంతర్ముఖమైన మనస్తత్వము సంకల్పరహితుడుగా ప్రకాశించే దినము.

నియమనిష్టలతో కాలనిర్మితముగా సాధనలు జరిపితే, ఆత్మజ్యోతి ప్రకాశించును. కానీ, చదువువలన ఫలితముండదు. నిజముగా, అశాంతికారకులు యెవరు? చదువరులే దీనికి మూలకారణం. అన్నిటినీ విమర్శించడము, అతిభాషలాడటం, వాదోపవాదాలను పెంచటం, వీటివలన శాంతిదూరమగును. చదువుతో ఆధ్యాత్మికవిద్యను జోడించాలి. ఆధ్యాత్మికమును లక్ష్యమందుంచుకొని ఐహికమును నడపాలి. అంటే, దేవాలయమునకుపోయి వ్యాపారములో లాభంవచ్చిన నీకు అర్ధమిస్తాను. అనిదేవునికి మాటిచ్చేదికాదు; ధ్యానమువలన ఆశలను తగ్గిస్తూ పోవాలి, ధ్యేయమునే లక్ష్యముగా పెట్టుకోవాలి. 'నివేదితా' తనకు ధ్యానములో ఏకాగ్రత సిద్ధించటము లేదని వివేకానందుని దగ్గర సలహాలడిగిందట. ధ్యానమందు మార్గరెట్ నోబిల్ అనే వ్యక్తి మధ్యలో వస్తుంది. (ఆమె పూర్వపు పేరు అది). అవ్యక్తిత్వమును నిర్మూలంచేయాలి. అని, దైవత్వమునకు నివేదితం చెయ్యాలి అని ఉపదేశించినాడు.

విసుగు అలస్యము నిరాశ దేనికీలొంగక, మానవాకారములో భగవంతుని ధ్యానముచేసి, సద్గుణవంతులైసర్వజీవులయందూ ప్రేమదృష్టి పెంచుకొని ఆనందమునను భవించుటే, గురుపూర్ణిమ యొక్క సందేశము.

దివ్య బోధ 27. 7. 80.

## ము ఖ్యా గ మ ని క

1980 నవంబరు 23వ తేది జన్మదినోత్సవ సందర్భములో శ్రీ సత్యసాయి సంస్థల మూడవప్రపంచ సమ్మేళనం ప్రశాంతినిలయంలో జరుగును. పైకారణంగా దసరాపండుగ జరుపబడదు. ప్రపంచ సమ్మేళన కార్యక్రమానికి ఏర్పాట్లు విరివిగా జరుగుచున్నందున ప్రత్యేక సంభాషణలు, కోర్కెలు అనుగ్రహింపబడవని పాఠకులు గ్రహించుటయేకాక, ఇతరులకు కూడ తెలియచేయగలరు.

సంపాదకుడు

---

## పు స్త క ము లు

| | పేరు | వెల | తపాల ఛార్జి |
|---|---|---|---|
| 1. | అద్భుతమూర్తి_(హవార్డ్ మర్ఫెట్ ఆంధ్రానువాదం_అమరేంద్ర) | 6-00 | 0-10 |
| 2. | ఆత్మారామం | 5-00 | 0-45 |
| 3. | ఆధ్యాత్మికదీపిక | 2-50 | 0-20 |
| 4. | జ్ఞానవాహిని | 1-00 | 0-10 |
| 5. | ధర్మవాహిని | 1-25 | 0-15 |
| 6. | ధ్యానవాహిని | 1-50 | 0-15 |
| 7. | ప్రశాంతివాహిని | 1-00 | 0-15 |
| 8. | ప్రేమవాహిని | 1-00 | 0-15 |
| 9. | మణిమాల | 2-00 | 0-20 |
| 10. | వచనామృతము (2) | 2-50 | 0-30 |
| 11. | సత్యం శివం సుందరం (1) | 5-00 | 0-35 |
| 12. | సత్యం శివం సుందరం (2) | 7-00 | 0-35 |
| 13. | సత్యం శివం సుందరం(3) | 5-00 | 0-35 |
| 14. | సందేహనివారిణి | 2-00 | 0-20 |
| 15. | సూక్తిరసతరంగిణి (ఉప్పాడ రాజారావు) | 2-00 | 0-25 |
| 16. | శ్రీ సత్యసాయీశ్వర నుతితరంగిణి (1) (ఉప్పాడ రాజారావు) | 3-00 | 0-35 |
| 17. | శ్రీ సత్యసాయీశ్వర నుతితరంగిణి (2) (ఉప్పాడ రాజారావు) | 2-00 | 0-25 |
| 18. | సువర్ణసుమమాల | 5-00 | 0-30 |
| 19. | శ్రీ సత్యసాయి వచనామృతము (1) | 3-00 | 0-35 |
| 20. | శ్రీ సత్యసాయివచనామృతము(3) | 2-00 | 0-20 |
| 21. | శ్రీ సత్యసాయిదివ్యబోధ | 2-00 | 0-20 |

---

కర్ణాటక రాజ్యపు బెంగుళూరు_67, బృందావనములోని 'వ్రజ్ బృందావన్ ప్రెస్' నందు పి. చంగ్కకోటిచే ముద్రింపబడి, యన్. కస్తూరిచే, "శ్రీ సత్యసాయి బుక్స్ అండ్ పబ్లికేషన్స్, శ్రీ సత్యసాయి సెంట్రల్ ట్రస్ట్" ప్రశాంతి నిలయము, తరపున ప్రచురింపబడినది. ఎడిటర్ : యన్. కస్తూరి. యం. యే., బి. యల్.

# శ్రీ సత్యసాయి బుక్స్ అం పబ్లికేషన్స్, శ్రీ సత్యసాయి సెంట్రల్ ట్రస్ట్, ప్రశాంతినిలయము,

## పత్రికలు — పుస్తకములకు ఆర్డర్లు.

(1) పత్రికలు : ఒక సం॥కు తక్కువ కానీ 5 సం॥ల కెక్కువకానీ చందాలు స్వీకరింపబడవు.

| ఇండియా | | | వార్షిక చందా |
|---|---|---|---|
| మాస పత్రిక | సనాతన సారథి | ఇంగ్లీషు | 6 రూ. |
| మాస పత్రిక | సనాతన సారథి | తెలుగు | 6 రూ. |
| త్రైమాసిక పత్రిక | సేవాదళ్ | ఇంగ్లీషు | 4 రూ. |
| త్రైమాసిక పత్రిక | శ్రీ సత్యసాయి బాలవికాస్ | ఇంగ్లీషు, హిందీ (ఒకే పత్రికలోనే) | 5 రూ. |

విదేశములు

| | సనాతనసారథి | | సేవాదళ్ | | బాలవికాస్ | |
|---|---|---|---|---|---|---|
| | సీమెయిల్ | ఏర్‌మెయిల్ | సీమెయిల్ | ఏర్‌మెయిల్ | సీమెయిల్ | ఏర్‌మెయిల్ |
| | రూ. | రూ. | రూ. | రూ. | రూ. | రూ. |
| ఆఫ్ఘనిస్థాన్ | 16 | 26 | | 12 | | 12 |
| ఆఫ్రికా | 16 | 46 | | 18 | | 18 |
| అమెరికా | 16 | 51 | | 20 | | 20 |
| ఆసియా ఖండపు దేశములు | 16 | 31 | | 14 | | 14 |
| ఆస్ట్రేలియా | 16 | 46 | | 20 | 9 | 20 |
| బర్మా | 16 | 26 | | 12 | | 12 |
| యూరప్ ఖండపు దేశములు | 16 | | | 18 | | 18 |
| పసిఫిక్ సముద్ర ప్రదేశములు | 16 | 51 | 9 | 20 | | 20 |
| శ్రీలంక | 8 | 21 | | 10 | | 10 |

(2) సనాతన సారథికి చందా పంపునపుడే ఏభాషలో (తెలుగు, ఇంగ్లీషు) కావలెనో తెలుపవలయును. చందా గడువు పొడిగించు సమయమునందును, మీ అడ్రస్సు నందు మార్పు అవసరమని తెలుపు సమయము నందును చందా నంబరును వ్రాసి పంపవలయును.

B (1) పుస్తకములు : ప్రస్తుతము మా యొద్ద నున్న పుస్తకములు, వాటి వెలలు, ఇండియాలోని వాటి పోస్టు ఛార్జీలును క్రింద తెలియజేయబడినవి. రిజిస్టర్డ్ పోస్టులో మాత్రమే పుస్తకములు పంపబడును. కాన రిజిస్టర్డ్ ఛార్జీ రూ. 2-25 లు మీ ఆర్డరుతో పంపవలసియున్నది. V.P.P. ద్వారా పంపబడవు.

(2) పుస్తకముల పూర్తి పేర్లు అవి ఏ భాషలో కావలయును అనునది స్పష్టముగా ఆర్డరులోనే తెలుపవలయును.

(3) ఫోటోలు/చిత్రములు పోస్టులో పంపుటకు వీలు కాదు.

(4) కార్యాలయమునుంచి వివరములు తెలుసుకొనవలెనన్న మీ చిరునామాగల స్టాంపు వేసిన కవరును పంపవలయును.

(5) పుస్తకముల ఆర్డరులు—విదేశములనుంచి తపాల ఛార్జీలు ఎంత అని ముందుగనే వ్రాసి తెలుసుకోవలెను.

(6) చందా మొత్తము కానీ, పుస్తకములకొరకు పైకము కానీ, శ్రీ సత్యసాయి బుక్స్ అండ్ పబ్లికేషన్స్, ప్రశాంతినిలయము, అనంతపుర ంధ్ర ప్రదేశ్ :515134. యొక్క యును. మనియార్డర్ పంపువారు వెనుకభాగమందు తమ చిరునామాను పూర్తి వివరములతో స్పష్టముగా వ్రాయవలయును.

---

(పుస్తకసూచి 216వ పుటలో చూడండి)

Regd. No. KRNU—83 SEPTEMBER 1980

మానవుడు తన అహంకారమును, స్వార్థమును, తనపాశవిక ప్రవృత్తిని, తన దేహదృష్టిని, బలిచేసి, విశ్వాత్మమైన పరమాత్మలో సమైక్యమును పొందడమే ధర్మము. సమస్త లౌకిక విషయాలయందు ఔచిత్యభంగముకాని మాటలు, హృదయద్రోహముకాని పనులు, సమయస్ఫూర్తి మార్పులు, స్వార్థరహితమైన నడకలు, భగవత్ప్రీతిగల భావములు, సత్యాన్వేషణములు, ఇవియేనిజధర్మములు. బ్రహ్మదృష్టితో చేసి బ్రహ్మైక్యానందశ్రీకి దారితీసే ప్రతి నిస్వార్థకర్మకూడా ధర్మమే.

-బాబా

Regd. with Registrar of Newspapers No. RN/10772/64